శ్రీ వేంకట రంగానంద సద్గురుభ్యోనమః.

# కైవల్యనవనీతసారసంగ్రహము.

ఇది,

కర్నూల్ నివాసులగు పోకల నారాయణస్వామినాయుని వారిచే

రచియింపబడి, వారిశిష్యులగు

హాళెంతుల్ బాలాంకంగారుచే సవరింపబడి,

———:O:———

మహాత్ములగు నిర్గ్రంథకర్త శిష్యులైన నంద్యాల్

నివాసులగు నిజానంద ఆశ్రములచే సరిచూడబడి,

అనంతపురం

బి. మునిస్వామినాయుడు అండు సన్సు,

స్వామివిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రచురింపబడెను.

మొదటికూర్పు 1,000 కాపీలు.

పోకల నారాయణస్వామినాయుడు.

1908 సంవత్సరం నవంబరునెల

వెల రు. 1-0-0.



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 6 | 5 | వారి | వారిని. |
| 7 | 28 | యంత్రముసు | యంత్రమును. |
| 10 | 4 | చేతసు | చేతను. |
| 10 | 9 | సుండి | నుండి. |
| 11 | 11 | దండహస్తుడై | దండహస్తుడై |
| 14 | 19 | చేతసు | చేతను. |
| 16 | 13 | యసు | యను |
| 16 | 18 | పోవుసు | పోవును. |
| 16 | 21 | సుంచుకొని | నుంచుకొని. |
| 18 | 3 | గాసు | గాను. |
| 18 | 6 | పోయినదా | పోయిసదా. |
| 18 | 11 | ప్రారబ్ధమసునది | ప్రారబ్ధమనునది. |
| 18 | 18 | సేసు | నేను |
| 19 | 17 | ఆదికార | అధికార. |
| 21 | 12 | యితరులసు | యితరులను. |
| 21 | 17 | సంసారముసుంచి | సంసారమునుంచి. |
| 21 | 21 | నాల్గవ | నాలుగు |
| 22 | 16 | అంతర్మనస్సకల్పములు | అంతర్మనస్సంకల్పము. |
| 22 | 19 | స్వప్నావస్థలలో | స్వప్నావస్థలలో. |
| 23 | 13 | యుక్తాసు | యుక్తాను |
| 24 | 6 | వారలసు | వారలను |
| 24 | 6 | నసహ్యాగాసుండు | నసహ్యాగానుండు |
| 25 | 6 | తెలిసికొసుట | తెలిసికొనుటయే |
| 25 | 19 | సంభవించుసు | సంభవించును |
| 25. | 19 | గసుక | గమక |
| 26 | 18 | విశ్వాసములసుంచి | విశ్వాసములనుంచి |
| 27 | 5 | నిద | నీద |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 27 | 19 | పడగుంట్లు | పడగంట్లు |
| 28 | 8 | పంచకోశములను | పంచకోశములను |
| 28 | 19 | చిత్తవసు | చిరమును |
| 29 | 6 | సుష్టపని | |
| 30 | 7 | జగజ్జీవ | జగజ్జీవ |
| 31 | 9 | శివసిషుప్తి | శివసుషుప్తి |
| 31 | 18 | ప్రపంచములసు | ప్రపంచములను |
| 31 | 21 | మయ్యెసు | మయ్యెను |
| 32 | 5 | గలిగెసు | గలిగెను |
| 32 | 17 | మాయసు | మాయను |
| 34 | 7 | కూటస్థుడనియు | కూటస్థుడనియు |
| 34 | 17 | అపరిచ్ఛిన్నుడను | అపరిచ్ఛిన్నుడను |
| 35 | 4 | తైజసుడనియు | తైజసుడనియు |
| 35 | 8 | మాయసు | మాయను |
| 35 | 13 | చిదాభాసుడసు | చిదాభాసుడను |
| 35 | 17 | మాయసు | మాయను |
| 36 | 7 | స్థూల | స్థూల |
| 36 | 19 | గించేసు | గించెను |
| 36 | 23 | స్థూల | స్థూల |
| 37 | 2 | అందుచేత | అందుచేత |
| 37 | 12 | స్పర్శ | స్పర్శ |
| 37 | 15 | అపంచీకృత | అపంచీకృత |
| 37 | 17 | స్థూల | స్థూల |
| 38 | 1 | అంతఃకరణములలో | అంతఃకరణములలో |
| 40 | 18 | గసుక | గనుక |
| 40 | 23 | లున్న | లున్న |
| 41 | 19 | దృశ్యమాసు | దృశ్యమాను |
| 41 | 22 | వ్యాప్తమయి | వ్యాప్యమయి |

| పు॥ | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 41 | 23 | పలస | వలన |
| 43 | 6 | నన్నిధానమునందు | సన్నిధానమందు |
| 44 | 2 | నర్వ | సర్వ |
| 44 | 3 | నియేదున్ను | నీయేదున్ను |
| 46 | 14&15 | కూపస్థుడున్ను | కూటస్థుడున్ను |
| 46 | 16 | నకల | సకల |
| 46 | 23 | అతీతమయిస | అతీతమయిన |
| 47 | 3 | అనుభవముస్ను | అనుభవమున్ను |
| 47 | 8 | గసుక | గనుక |
| 48 | 5 | బ్రహ్మానందాసుభవ | బ్రహ్మానందానుభవ |
| 48 | 19 | అదియేలాగు | అదియేలాగు |
| 49 | 20 | జీవమ్ముక్తులుస్ను | జీవన్ముక్తులున్ను |
| 50 | 19 | తాపని | తానని |
| 53 | 3 | లోసు | లోను |
| 54 | 5 | దాసు | దాను |
| 54 | 12 | ఆసంకల్ప | ఆసంకల్ప |
| 54 | 17 | ఆసుఖయములో | ఆసుఖములో |
| 55 | 7 | కార్యముసు | కార్యమును |
| 55 | 8 | ఇదియుసు | ఇదియును |
| 55 | 11 | జన్మములేదసుట | జన్మములేదనుట |
| 57 | 5 | సుఖనమాధి | సుఖసమాధి |
| 60 | 8 | దేహ | దేహ |
| 60 | 15 | వచ్చుసు | వచ్చును |
| 60 | 17, 18 | వాయుముసు | వాయమును |
| 60 | 23 | రాజన | రాజస |
| 61 | 7 | లక్య | లవాక్య |
| 61 | 13 | వచ్చుసు | వచ్చును |
| 62 | 6 | తెఃసుకొని | తెలుసుకొని |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 62 | 7 | సుందుమని | సుందుమని |
| 62 | 20 | కిచిదక్ష | కించిదజ్ఞ |
| 64 | 8 | గసుగొసు | గనుగొను |
| 64 | 14 | రూపముసు<br>తెలుసుకొసు | రూపమును<br>తెలుసుకొను |
| 64 | 15 | తెలుసుకొన | తెలుసుకొనక |
| 65 | 2 | కొనవలెసు | కొనవలెను |
| 66 | 21 | అనునప్పుడు | అనునపుడు |
| 68 | 10 | సకలముస్నూ | సకలమున్నూ |
| 68 | 14 | శివంపపరం | శివపరం |
| 70 | 1 | అసునది | అనునది |
| 71 | 8 | విడుచుచుసు | విడుచుచును |
| 71 | 22 | అనత్తుచిత్తులు | అసత్తుచిత్తులు |
| 71 | 22 | రెండుసు వేఱనిసను | రెండును వేరనినను |
| 72 | 2 | వేరైన | వేరైన |
| 72 | 4 | అనలదముసకు | ఆనందమునకు |
| 72 | 5 | అప్పట్టో | అప్పట్లో |
| 72 | 10 | దివ్యమైస | దివ్యమైన |
| 72 | 23 | తెలుసుకొనవలయుసు | తెలుసుకొనవలయును |
| 74 | 8 | నందులేక | సందులేక |
| 75 | 17 | నిరాకారుడసు | నిరాకారుడును |
| 87 | 9 | వలెసు | వలెను |
| 77 | 10 | ముందు | ముందు |
| 77 | 15 | తానేతాసు | తానేతాను |
| 78 | 7 | వుండుఃముద్రముగా | వుండుసముద్రముగా |
| 78 | 17 | దోచిసది | దోచినది |
| 78 | 23 | స్మృతిలో | స్మృతులలో |
| 80 | 7 | వలెసు | వలెను |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 81 | 2 | వారకి | వారికి |
| 81 | 14 | తొలంగదని | తొలగదని |
| 81 | 22 | తెలుసు | తెలుసు |
| 81 | 27 | ఇంకు | ఇందుకు |
| 82 | 6 | శైనం | శైవం |
| 72 | 10 | ధిక్యారై | ధిల్యావే |
| 82 | 11 | నిసదా | నీసదా |
| 83 | 6 | అగమములు | ఆగమములు |
| 83 | 7 | అవాహనము | ఆవాహనము |
| 83 | 14 | నుండుయే | నుండుటయే |
| 83 | 15 | జెప్పను | చెప్పను |
| 83 | 15 | న్మశానములో | స్మశానములో |
| 84 | 5 | అదిమూలమైన | ఆదిమూలమైన |
| 84 | 7 | వను దేవుడు | వసు దేవుడు |
| 85 | 14 | విచారజ్ఞావము | విచారజ్ఞానము |
| 85 | 14 | చెయుట | చేయుట |
| 86 | 5 | ఉపసంహాత | ఉపసంహార |
| 86 | 12 | «ఛాందోగ్యోపనిషత్తు | « ఛాందోగ్యోపనిషత్తు |
| 86 | 21 | అంతకరణము | అంతఃకరణము |
| 87 | 3 | యానముగా | యాసముగా |
| 87 | 21 | నుచి | నుంచి |
| 88 | 2 | యుండుటుకు | యుండుటను |
| 88 | 12 | అశ్రద్ధ | అశ్రద్ధ |
| 89 | 18 | వినబడిన | వినబడని |
| 90 | 19 | వెసుక | వెనుక |
| 90 | 21 | చేరి | చేసిరి |
| 91 | 4 | సుషుప్తి | సుషుప్తి |
| 92 | 6 | అనగా | అనగా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 92 | 12 | అన్నము | అన్నము |
| 92 | 16 | తెలఁనుకో | తెలుసుకో |
| 92 | 23 | ప్రతిష్ణగా | ప్రతిష్టగా |
| 93 | 4 | జలముసు | జలమును |
| 93 | 9 | ఆకారణము | అకారణము |
| 93 | 11 | కారణముసు | కారణమును |
| 93 | 12 | కొసుము | కొనుము |
| 94 | 23 | కారణరూవమై | కారణరూపమై |
| 94 | 11 | వుపదేశము | వుపదేశము |
| 94 | 17 | తెలనుకో | తెలసుకో |
| 95 | 12 | తెలనుకొనుట | తెలసుకొనుట |
| 96 | 1 | అసస్తు | అసత్తు |
| 96 | 17 | చెట్టుయొక్క | చెట్టు |
| 96 | 18 | అణగి | అణగి |
| 99 | 18 | ఆవుసుడు | ఆపురుషుడు |
| 99 | 22 | పుత్తరపు | వుత్తరవు |
| 100 | 18 | యిటువాని | యిటువంటివాని |
| 100 | 21 | బ్రంహ | బ్రహ్మ |
| 101 | 2 | ఆదే | అదే |
| 101 | 15 | తారతమ్యముకు | తారతమ్యమును |
| 102 | 7 | మాత్మ్యము | మాత్మ్మము |
| 102 | 7 | ఆదియే | అదియే |
| 102 | 10 | సమమముగ | సమముగ |
| 102 | 11 | విద్వాంనుడు | విద్వాంసుడు |
| 102 | 11 | జ్ఞాని | అజ్ఞాని |
| 102 | 18 | ఆడుగగా | అడుగగా |
| 102 | 20 | అగ్ని | అగ్ని |
| 102 | [illegible] | చేనుకొనుచున్నాడు | చేసుకొనుచున్నాడు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 102 | 23 | వాద | వాదు |
| 103 | 8 | సత్య | సత్య |
| 208 | 13 | చేన టవలన | చేసుటవలన |
| 103 | 19 | తెలుసుకున్నాడు | తెలుసుకున్నాడు |
| 103 | 3 | యెన్మిదివిధములు | యెనిమిదివిధములు |
| 104 | 14 | నట్టైన | నట్టియున |
| 104 | 15 | దేహమా | దేహమో |
| 105 | 8 | భజించి | విభజించి |
| 105 | 8 | తెలుసుకొనునది | తెలుసుకొనునది |
| 105 | 9 | తెలుసుకొను | తెలుసుకొను |
| 105 | 10 | తెలుసుకొన్నయడల | తెలుసుకొన్న |
| 105 | 19 | అప్రత్యక్షమైన | అప్రత్యక్షమైన |
| 105 | 20 | తెలుసుకొన్న | తెలుసుకొన్న |
| 105 | 22 | తెలుసుకొనుటయే | తెలుసుకొనుటయే |
| 103 | 14 | స్వరూప | స్వరూప |
| 107 | 1 | దెలుసుకొనడమే | దెలుసుకొనడమే |
| 107 | 21 | సఖ | సుఖ |
| 108 | 14 | అజ్ఞానదశలో | అజ్ఞానదశలో |
| 108 | 15 | యనవచ్చు | యనివచ్చు |
| 108 | 15 | వృద్ధి | వృత్తి |
| 108 | 19 | దెహాభీనమును | దేహాదారుఢ్యమును |
| 110 | 5 | నినకడియర్థప్రత్తి | వినకడియర్థాపత్తి |
| 110 | 11 | అతసు | అతను |
| 110 | 15 | వినికడి | వినకడి |
| 110 | 16 & 17 | తెలుసుకొనబడిన పదార్థమును | తెలుసుకొనబడిన పదార్థమును |
| 113 | 5 | బుద్ధివృత్తివరిహరించు | బుద్ధివృత్తిపరిహరించు |
| 114 | 22 | అజానమే | అజ్ఞానమే |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 115 | 1 | అజ్ఞానమే | అజ్ఞానమే |
| 115 | 2 | డిటో | డిటో |
| 115 | 3 | స్పర్శరూపగంధ | స్పర్శగంధ |
| 115 | 4 | అజ్ఞానమే | అజ్ఞానమే |
| 115 | 4 | రసరూపముగా | రసరూపముగా |
| 115 | 7 | అజ్ఞానమే | అజ్ఞానమే |
| 115 | 11 | తెలుసుకొనుటమే | తెలుసుకొనుటయే |
| 115 | 14 | ఈప్రకారమే | ఈప్రకారమే |
| 115 | 17 | యఖండాకాం | యఖండాకార |
| 117 | 10 | అధ్యాన | అధ్యాస |
| 117 | 18 | భూతములయినది | భూతములైదును |
| 118 | 21 | స్వరూపానందము | స్వరూపానందము |
| 119 | 7 | అంతర్గ్రాహ్యాను | అంతర్గ్రాహ్యాను |
| 119 | 2 | అంతర్ద్రశ్యాను | అంతర్దృశ్యాను |
| 119 | 5 | అంతదృశ్యాను | అంతర్దృశ్యాను |
| 119 | 22 | చంపబడని | చంపబడిన |
| 121 | 18 | అశేషవానవా | అశేషవాసనా |
| 121 | 21 | బొందుసు | బొందును |
| 122 | 2 | కర్మములకున్ను | కర్మములకున్ను |
| 122 | 21 | వివేవికికి | వివేకికి |
| 123 | 6 | శుద్ధుడసు | శుద్ధుడను |
| 123 | 2 | అశజ్ఞ | అశబ్ద |
| 124 | 5 | సమాధులసు | సమాధులను |
| 124 | 7 | నిర్వికల్పముసు | నిర్వికల్పమును |
| 124 | 19 | స్వరూపమునందు | స్వరూపమునందు |
| 124 | 20 | వస్తువేతానవి | వస్తువేతానని |
| 140 | 5 | ప్రకూతుక | పకూతుక |
| 140 | 9 | డిటో | డిటో |
| 140 | 11 | డిటో | డిటో |

46, 47, 58, 63, 70, 72 పేజీలలో "సారపంగ్రహమును" అను పదమును సారసంగ్రహము అనిచదువుడి

80,88,91,104,182,140 పేజీలలో "కైవల్యవపనీత" అనుపదమును కైవల్యనవనీతఅనిచదువుడి

———(0)———

# ఉమామహేశ్వర పీఠముయొక్క భక్తులచందా

| | | రు. |
|---|---|---|
| 1. | నిజానంద అభయులు ... ... | 20 |
| 2. | విద్యానంద అభయులు ... ... | 20 |
| 3. | వురవకొండ మేదర నాగప్పగారు ... | 15 |
| 4. | ఆత్మకూరు నారాయణశింగ్ గారు ... | 15 |
| 5. | బుక్కాపురం అశ్వర్థంగారు ... | 10 |
| 6. | డిటో. వేంకటప్పగారు ... | 10 |

పోషకులు.

| | | |
|---|---|---|
| 1. | ఆమిదాలరెడ్డి మల్లికార్జునగౌడు ... | 10 |

# గురుపారంపరం.



శ్రీకైలాసమందు వుదయించిన వుమా మహేశ్వరులు. వారి శిష్యులు నందికేశ్వరులు, వారి శిష్యులు సనత్కుమారులు, వారి శిష్యులు సూత ఋషి, భగవాన్‌నాధులు, తరువూరు సిద్ధులు. వారి శిష్యులు అరుళ్ మునివరులు వారి శిష్యులు కఘూర్ మునివరులు, పరమునివరులు, తిరు ప్పణాంకాళర్, మధుర వుంజమునివరులు, తిరునటరాజర్, శివప్రకాశం, స్వరూపానందస్వామి, తత్వరాజస్వామి, శాంతలింగస్వామి, కుమారదేవర్, చిదంబరస్వామి, నారాయణదేశికస్వామి, తాండవరాయస్వామి యీ పర మున తాతప్పమెయిజ్ఞానపరదేశి, తిల్లినాయస్వామి, వేంకటరంగా దేశిక స్వాములు, ప్రణవానంద అభయులు, నిజానంద అభయులు.

శ్రీవేంకట రంగానంద సద్గురుభ్యోనమః.

# కైవల్యనవనీతసారసంగ్రహము.

## గణపతిస్తుతి.

ఉ॥ శ్రీగణనాథు వేదపరిశిష్టగుణైకసనాథుసంతతం । బాగమకోటిపూజ్యు
సముడంచిత తత్వకథేజ్యుజ్ఞానసం । యోగనియోక్తృనేత్రిదికరణోద్ధతి
గొల్చెద దంతవక్త్రునెం । తేగురుభక్తికారణమతిన్బరమైక్య సదుక్తి
రక్తినొ ॥

## గురుస్తుతి.

ఉ॥ వంకరలేనినిత్య నిరవర్యనిజామల శుద్ధసత్వరూ । పాంకురమైనజ్ఞాన
విభవాభ్యుదయంబుగబుట్టినాకుని । శ్శంకశివైక్యబోధనువెసగ్గనునట్టి
మతిన్నిగుస్చశ్రీ । వేంకటరంగదేశికు నవీనపదాంబురుహంబు బూ
నెదన్ ॥

## ప్రతిజ్ఞ.

మ॥ మునువేదాంతరహస్యమండలముఁ గంబూరంగనాథ్యుల్ సనా । తన
ధర్మజ్ఞులుగూర్చిపేర్చిరిటదత్తాత్పర్యసంతృప్తినే । పునసేనీనవనీతసార
మురసస్ఫూర్తిప్రబంచింతువే । కొనుడీసారరహస్య వేదులుముముక్షు
లు జన్మజాడ్యంబరన్ ॥

## గర్వభంగ ప్రసంగము.

మ॥ జగతిన్బ్రాకెనయైనకొండొకడు సద్జ్ఞానిప్రధద్ధత్వవి । ద్యగనాకూరక
సర్వమేననడు వేదాంతంబువాక్కున్ప్రచ్చమేలుగభూమిన్వహించు శేష
ఫణిచెల్వొంజూచి వర్షర్తువం దగుకర్తంబుల నెబ్బుయెత్తునటు మన్నుం
గావె తర్కింపగన్ ॥

—(*) వైరాగ్య ప్రకరణము. (*)—

( పీఠిక. )

ఈ గ్రంథకర్త తానుబొందిన నిరతిశయానంద సాక్షాత్కార స్వానుభూతి ప్రత్యక్షమును ముముక్షులు కరతలామలకముగ దెలసి దానినిత్యతృప్తినొందుటకు గృపచేసి వైరాగ్య ప్రకరణము, ముముక్షు ప్రకరణము, ఉత్పత్తి ప్రకరణము, స్థితి ప్రకరణము, ఉపశాంతి ప్రకరణము, నిర్వాణ ప్రకరణము, అనంబరగు షట్ప్రకరణంబులచేత బ్రకాశించు నీగ్రంథము ను రచియించుట కారంభించి, పూర్వజన్మ సంస్కారఫలముచేత కించిదావరణ విలక్షణముబొంది యాత్మానాత్మ విచారణచేయ నుద్దేశించి వచ్చు శిష్యునకు బ్రపంచవైరాగ్య ప్రకరణమును బోధించుచున్నారు.

శ్లో॥ దేహఏవాత్మవిజ్ఞేయో । భోగప్రాప్తిస్తునిర్వృతిః ।
శరీరాపేక్షయామర్త్యా । మృతానాయాంతివిష్టపే ॥౧॥

మోహమేతాదృశంహిత్వా । ముక్తిమిచ్ఛంతియేనరాః।
తేధికందేవసదృశా । శాంతదాంతసమన్వితాః ॥౨॥

శ్లో॥ ఉత్పత్తిస్థితిలయాస్సంతి । మర్త్యానాంస్త్రిదివౌకసాం ।
ఏతేష్వత్రిషుకాలేషు । దుఃఖయేవసుఖంనహి ।
అజ్ఞానాదేవంజీవస్యసంప్రాప్తావిషయానపి ।
ఉజ్ఝిత్వాశ్రీగురుంధ్యాత్వాసాహాయ్యంప్రాప్యసద్గురోః ।
ప్రసాదేననరోముక్తోభవరోగాద్వివర్జయేత్ ॥

—(*) వీనికి వివరము. (*)—

ప్రశ్న. దేహమేయాత్మయా ? బహిరంతరమునవితరాత్మలేదా ?

ఉత్త. కరణములుండుటచేతనే దేహమేయాత్మయనిచెప్పకూడదు. బహిరంతరమునవితరాత్మ వేరులేదు.

ప్రశ్న. మనస్సొకటియేకాని యితర కరణము లెవ్వియునులేవు. భోగములయందు స్త్రీసంయోగమేముక్తి, వారిసర్వదా మననము చేయుటయేవిద్య, సర్వకాలసర్వావస్థలయందు వారి విచారమువలని శరీరము శుష్కించుటయేతపస్సు, ఎల్లప్పుడు వారితో సరససల్లాపములు సలుపుచుండుటయే జీవన్ముక్తి, సదావారలకు నాలింగన సుఖలోలాయమానుడుగా నుండుటయే విదేహముక్తి, వారు ధరియించియుండు పుష్పసుగంధవాసనల నాఘ్రాణించుటయే స్వర్గభోగము, వారియధరపానమే యమృతపానము, యిట్టిసౌఖ్యములకు వేరైనవాడు నరకమునుబొందును, మఱియు గిట్టువారు పుట్టుటయేలేదు, అట్లుపుట్టినయడల పూర్వపు వివేకమిపుడుండవలెను, ఆవిధముగా లేనందున దేహమే యాత్మయనియు, భోగమేమోక్షమనియు, గిట్టువారు మరల పుట్టరనియు, వచియించుటయే యదార్థమగునుగదా ?

ఉత్త. అది భ్రాంతిసుమా "సత్యంవదధర్మంచర స్వాధ్యాయాన్మామదః" అను న్యాయముండుటవలన సత్యములాడుచు ధర్మమార్గ ప్రవర్తకులైయుండవలయును. ఆమార్గము నవలంభింపక పశుపక్షులవలె వివేకశూన్యులై జిహ్వోపస్థ తత్పరులై వృధాకాలయాపనముజేయువారికి నరకమేగాక మోక్షముసిద్ధించనేరదు. అయితే మనము మృతినొందినవెనుక మనకుండు స్థలమెయ్యది ? మన

మెచటినుండి వచ్చిన వారము మనగతి యేదియని విచారించి గ్రహించక బుద్ధి శూన్యులై యుండుటయే యిట్టి యనర్థములకు హేతువగును.

ప్రశ్న. అదియేప్రకారము?

ఉత్త. దేహమే వివేకముగల యాత్మయని చెప్పెడి పక్షమున దేహముండు పర్యంతము వివేకముండవలయును, ఆలాగు కనపడదు. దేహము నశించినపుడు వివేకవంతమైన ప్రాణము దానిని విడిచి పోవుటచేత దేహములోని జ్ఞానస్వరూపుడైన దేహితా నొకడున్నాడనియు వాడు యీ దేహమును విడిచి యన్యదేహమునకు బోవుటవల్ల యీదేహము నిశ్చేతనమగు శవమైపడి యున్నదనియు, దేహమాత్మకాదనియు, జడమనియు, గ్రహించి సందేహమును తొలగించుకొనవలయును.

ప్రశ్న. స్త్రీభోగమే మోక్షమా ?

ఉత్త. అది మోక్షముకాదు.

ప్రశ్న. అది యేలాగు మోక్షముకాదు ?

ఉత్త. మలమును భుజియించుట కిచ్ఛయించి సంచరించు సూకరము తదితరులచే విసర్జింపబడిన యశుద్ధముల భక్షణమొనరించి ఉష్ణముచే తపింపుచు దారిలోని జలదారి బురదనుజూచి యందులో బడి పొరలి యాయశుద్ధ జలమున్ద్రావి నిజపరితాపంబును బాపుకొనిసుఖించుచుండునట్లు మూఢుడైనవాడు రక్త, మాంస, మల, మూత్ర, శోణిత, దుర్గంధములచే నిండి యనేక జన్మసంచితములగు పంచమహాపాతకముల నొకటిగాజేర్చి బ్రహ్మసృష్టించిన స్త్రీయంత్రమునుజూచి సుఖమనిభ్రాంతినొంది యాస్త్రీయధరపానం

బొనర్చి, స్తనరూపంబులగుమాంసఖండంబులకాసక్తుడై యశుద్ధ యుక్తంబులగు దానిపాదంబుల కన్నుల నెత్తుకొని దానియోని కూపంబునంబడి, సదా యిదియే సుఖకరంబని యెంచి రమించు చుండును. పరిశుద్ధమైన మోక్షేచ్ఛగలవారలు శుద్ధుడు నిత్యుడు నగు పరమేశ్వరానుగ్రహమునొంది దాసోహమ్మని బిరుదువహిం చిన విజ్ఞుల నవలోకించి పూజించుచు వారివలన నిత్యసుఖదాయ కంబగు మోక్షసామ్రాజ్య సుఖమును బొందుదురు. ఆప్రకారము గా భోగముమోక్షమనివచింపగూడను.

మరణమునొందినవారు పునర్జనము బొందుచున్నారను నదియే నిశ్చయము.

ప్రశ్న. ఆలాగుమృతిజెందినవారికిపునర్జన్మమేప్రకారముగావచ్చుచున్నది?

ఉత్త. జాగ్రదవస్థయందు మనోరాజ్యముజేయునపుడు జీవుడుపేక్షించు పదార్థములు జాగ్రదవస్థనువిడచి స్వప్నావస్థయందు నిక్కముగా జూచి యనుభవించు రీతి యీజన్మములోని యాశక్తిలోనగు వా సనలేమరణానంతరము పునర్జన్మమునకు కారణభూతములై యందు కుదగిన స్థూలశరీరములను మరలధరించి వానిననుభవింపవలసినద వశ్యకమగును.

ప్రశ్న. మృతిజెందినవారు మరల నుద్భవించుట నిశ్చయమైతే పూర్వజన్మ జ్ఞానమిపుడుండవలయునుగదా?

ఉత్త. పూర్వమందు గతించిన పుత్రమిత్ర కళత్రాదులను జననీజనకులు స్వప్నావస్థయందగుపడేకాలమందు వారలతో యదార్థముగా సం భాషించుచున్నపుడు యెవరును యిది మిథ్యయని యెందుకు దెలి సికొనలేదు. జాగ్రదవస్థలో వీరుమృతిజెందిరని యెరిగియుండిన

జీవుడే స్వప్నములో నిజమనియే వీక్షించుచున్నాడు. గాని జా
గ్రదవస్థలో జరిగినకార్యములను విస్మృతిజెందుచున్నాడు.
ఈకారణముచేత గిట్టినవారు మరల పుట్టినను పూర్వజన్మవృత్తాం
తము యీ జన్మమందు కనపడదనునదియే నిశ్చయము.

ప్రశ్న. ఆలాగు కనపడకుండుటకు కారణమేమి ?

ఉత్త. ఈజీవుడు స్థూలదేహముతోకూడి జాగ్రదవస్థయందు యింద్రియ
వ్యవహారములను జరిపి స్వప్నావస్థయందు స్థూలదేహమును వద
లి సూక్ష్మదేహమును అవలంభించినందువల్ల పూర్వావస్థ యం
దుండిన జ్ఞాపకములు స్వప్నావస్థయందగుపడుటలేదు. ఇదే ప్ర
కారముగా సప్తవిధములైన జన్మములందుండిన జ్ఞాపక శక్తులొక
శరీరమువిడచి మఱియొక శరీరమును ప్రవేశించు నపుడు జీవుడు
మరణావస్థలోబడు కష్టములచేత పూర్వజన్మజ్ఞానమును బొంద
లేడు. అట్లు బొందకున్నను పైకారణములనుబట్టి గతించినవా
నికి పునర్జన్మమున్నదనియే సిద్ధాంతమని యంగీకరించబడినది.

ప్రశ్న. అయితే కొందరు దేవభోగములనుగురించి యాగాది కర్మములు
జేయుచున్నారే అందుచేత సుఖములేదా ?

ఉత్త. ఆదేవజన్మమునందును సుఖములేదు. ఏలాగనిన దేవయోనిలో
న్మించుసమయమందును దుఃఖముగలదు. జన్మించు కాలమందు
దుఃఖము స్థితిసమయమందు బ్రహ్మాదిదేవతలకున్ను ఋషీశ్వరుల
కున్ను సంభవించు యన్యోన్యశాపములచేతను ఒకరి భార్య నొక
రపహరించుటచేతను రాక్షసులు తమభోగభూమిని యుత్పాతనచేసి
కొనికొట్టి తరిమివేయుదురనే భయముచేతను దుఃఖములేతప్ప
కించిదపి సుఖములేదు. మరణ కాలములో పూర్వము చేసి

యుండిన యాగాదికర్మములచేత ౭౧ చతుర్యుగములానంద భోగ మనుభవించి తీరినపిదప అచ్చటయుండు దేవతలచేత పెట్టిత్రోయ బడి నక్షత్రములై తలక్రిందుగా భూమిమీదమండిపడినపుడు యా యానందమును విస్మృతిజెంది యనిత్యముగాబోవుటచేతను, విస్మృ టయుద్భవించుకాలములో పూర్వము పసుబంధనముఁ జేసిన పాప కర్మములచేత భువిలో నెట్టిలు, క్రిములుగా జన్మించుటచేత దుఃఖమ నుసదియే నిశ్చయము.

ప్రశ్న. మనుష్య జన్మమున సుఖములేదా ?

ఉత్త. ఈమనుష్యయోనులనుండి జన్మించుకాలమునందు జనని యొక్క గర్భమునందు కట్టుపడి ఆమెయొక్క మల, మూత్ర, క్రిములచేత ను, జఠరాగ్నిచేతనుతపించి తల్లి యన్నపానాదులు తృప్తిగా భు జించియుండినపుడు దేహముసలియుటచేత శ్వాసముధారాళముగా విడుచుటకు కష్టపడుటచేతను ఆజననిభుజింపని యపుడు కలుగబ డు జఠరాగ్నివలన దహింపబడు ప్రయాసముచేతను, ప్రసవకాల మునందు ప్రసూతవాయువుచేత త్రోయఁబడి గానిగెలోజిక్కిన యిక్షుతిలలచందంబున యోనిద్వారముగుండాసన్నమై పర్వతము మీదనుంచి తలక్రిందుగ త్రోయబడురీతి భూమిమీద శిశువుగా బడుటచేత దుఃఖము స్థితికాలమునందు శిశువుపర్వములో గ్రహ దోషములు పక్షిదోషములాదిగాగల వానిచేతను, బాల్యావస్థ లో కర్ణవేధజ్వరమాదిగాగల వ్యాధులచేత నొందు కష్టమువలన విద్య మొదలయిన కర్మలచేతను, ఉపాధ్యాయులు మొదలగువా రు కలుగజేయు కష్టములచేతను, కౌమారపర్వములో ధనధాన్య ములు సంపాదించవలెనను పచ్చువాంఛమోహాములచేతను, అధిక

ధాన్యార్జనకు విఘ్నములు సంప్రాప్తమౌటచేతను విషయ భోగే చ్ఛలచేతను, అహంకారముండుటచేతను, విద్యాభ్యాసము చేయ కుండుటచేతను. "విద్యావివాదాయధనంమదాయ। శక్తిఃపరే షాంచనిపీడనాయ। ఖలస్యసాధోర్విపరీతమేతత్। జ్ఞానాయదా నాయచరక్షణాయ" అను న్యాయమువలన విద్యనభ్యసించుట జ్ఞానోదయ ప్రాప్తికొరకేగాక కుతర్కములవలన క్లేశసంప్రాప్త మౌటచేతను, మఱియు, "అంగంగళితం ఫలితంముండందశనవిహీ నంజాతంతుండం। వృద్ధోయాతిగృహిత్వాదండంతదపినముంచత్యా శాపిండం" అను న్యాయమవలంబించి వృద్ధావస్థలోకూడా శరీర మంత గళితమైనను శిరస్సంత తెల్లనివెండ్రుకలచేత నావృతమైనను దంతములంతవదలినను దండహస్తుడై సంచరించినను "ఆశాశా పరమందుఃఖం" అను న్యాయరీతిని అత్యాశవర్జించ కుండుటచేత ను అనేకవ్యాధు లుద్భవించుట చేతను పుత్రమిత్ర కళత్రాదులకు రోగములువచ్చుటచేతను దుఃఖము. ఇదియునుగాక ప్రాణాధార ముగానుండిన పుత్రుడు మృతిజెందిన సమయములో గృహము వి రిగిపడుట, కృషిచేయు వృషభములు మృతినొందుట, ఋణమి చ్చినవారడ్డగించుట, యెపుడురాని బంధువులువచ్చుట, గేహమం దు వకకాన్పైనను లేక యితర సదనమందప్పుడుగుట, వారలివ్వ కుండా పూర్వము ఋణమిచ్చిన వారలాటంకపరచడము. ఈప్ర కారము నానావిధములైన కష్టములచేతను, జలములో ప్రతిఫలిం చిన చంద్రుడు వాయువుచేత చలించు చందంబున కష్టసంప్రా ప్తమౌటచేతను, దుఃఖము, మరణకాలమందు వాత, పిత్త, జ్వర, క్షయ, గుల్మ, శూలాది మొదలైన యనేకరోగములచే వ్యాప్తమై

యంతఃకరణము శిథిలమౌటవలన కాలయమునివీక్షించిన కైనడిన చ్చుభయములచేతను ఊర్ధ్వశ్వాసములచేత శ్రమజెంది శ్లేష్మము లోకట్టుబడి ఆయాసమైన ప్రాణప్రయాణకాలములో ననుపడుదుః ఖములచేతను ఆవిధమున ప్రాణగమనసమయమున అజ్ఞేయనదిలో ను నరకములోను తప్తపాషాణములయందును, అసిపత్రవనములో ద్రోయబడి యమభటులచే శిక్షింపబడిన యాతనవల్ల దుఃఖము. ఈ రీతిగా దేహమానుషములైన ద్వివిధజన్మములుగలవారికే క ష్టమై తేజ్ఞానహీనములగు పశుపక్షిస్థావరాదులు దుఃఖసముద్రము లో మునిగి పాపకరమైన నరకములో బడుకష్టమింతయని వచించు టకు సాధ్యముకాదు. గనుక పునర్జన్మము రాకుండాపుండేమార్గమే దో దానినివిచారించి తెలిసికొనవలసినది యవశ్యకము. ఇందుకు వాక్యము, " పునరపిజననం పునరపిమరణం। పునరపిజననీజఠరే శ యనం। ఇహసంసారేబహుదుస్తారే। కృపయాపారేపాహిమురా రే " గనుక జననమరణరహితమైన పరమాత్మానుసంధానమార్గ విచారతత్పరుడౌట యవశ్యకము.

ప్రశ్న. విచారించి తెలుసుకొనుమార్గమేది ?

ఉత్త. నేను, నాది, యనుబంధములు విడిచెనేని జీవత్వం నశించును. ఈ నేను, నాది, యనుబంధములే జీవస్వరూపము. ఈరెండు వి ధబంధనములలో ముందు నాదియను బంధము విడువవలెను.

ప్రశ్న. అదియేది ?

ఉత్త. భార్య, బిడ్డలు, గృహము, భూమి, ధనము, ధాన్యము, నాదియని యభిమానించుట ఆత్మకు స్వభావముకాదు. అది యజ్ఞాన మోహాంధకారబుద్ధిచేత వచ్చినది.

ప్రశ్న. వానికి వివరమేమి ?

ఉత్త. భార్యయనునది, వక తల్లితండ్రులకు పుత్రికయైయుండుటయును, నీవొక జననీజనకులకు పుత్రుడుగానుండుటయును, భార్యదేవ్వారు, నీదియేవ్వారు, అని యీలాగు వేరుగానుండుటచేత అది నాభార్య యని నీకుసత్యమైనబుద్ధిరావచ్చునా, ఆభార్య నిన్నుత్యజించి పోవుచున్నది; నీవు దానిని విడలుచున్నావు; గనుక అదినీకు స్వాంతముకాదు. అట్టిభార్యనునాదియని చెప్పకూడదు. మఱియు బిడ్డనునాదియని చెప్పుచున్నావే ఆబిడ్డను నీవు కలుగజేసినావా లేక నీభార్యకలుగజేసినదా, లేక యితరులవల్ల కలిగినదా, యీప్రకారము మీాయెవరిచేతను కలుగజేయబడని శిసువును వృధాయాసించుట భ్రాంతియే, యిదిగాక స్వప్నావస్థలో వంధ్యశిశువు ప్రబసవించినట్లైనడి యింద్రజాలుడు తనవిద్యను చూపించుటవలె బ్రహ్మసృష్టివల్ల మీాయిరువురమధ్యనొక శిసువురీతి నగపడినదానిని నాబిడ్డయని యెట్లుచెప్పవచ్చును. వీధిలో గనబడు శిసువును నాబిడ్డయని యెవడు చెప్పును. దానివలె బ్రహ్మసృష్టివల్లవచ్చిన బిడ్డ తప్ప నీబిడ్డకాదు గనుక బాలను నాదియని చెప్పుట యుచితము కాదు. అలాగే గృహద్వారభూమిధనధాన్యాది సంపత్తులు సర్వమును. నీజనకువల్ల నార్జించబడినందువల్ల వివేకముచేత విచారించునపుడు నీవతనికి బిడ్డకానందువల్ల. నీవు వీనినాదియని నుడువుట యవశ్యముకాదు.

ప్రశ్న. ఆప్రకారముకాదు నేనేకష్టపడి ద్రవ్యముసంపాదించి ఆద్రవ్యమువలన గృహభూమిమొదలగువానిని సంగ్రహించినానే ?

ఉత్త. అలాగైనప్పటికి ఆద్రవ్యములు నీవికావు.

ప్రశ్న. అదియేలాగు ?

ఉత్త. ద్రవ్యములంతయు రాజులకు స్వంతమైనందువలన ఆద్రవ్యములు కూడా నాదియని చెప్పుటతగదు.

ప్రశ్న. ఐతే భార్య సంతానము ద్రవ్యములనెడు ఈపణత్రయములు నాది కాదనినను, ఈదేహమైనా నాదియని చెప్పవచ్చునా ?

ఉత్త. ఈదేహమునీది కాదు. నీవుఈదేహమును ఈశ్వరునివద్ద కార్యార్థముగాతీసుకొని వచ్చినావు.

ప్రశ్న. అదియేలాగు ?

ఉత్త. దీర్ఘకాలముగా జన్మించుట మృతిబొందుట ఈలాగైనదుఃఖము లజెందితిర్యగాది స్థావరములుగాబుట్టి శ్రమజెంది ఆప్రయాసమంతయు కించిద్వివేకముతో దెలుసుకొని ఈశ్వరునిగూర్చి ఈజన్మ సాఫల్యమౌటకు నాకుమనుష్యశరీరము దయచేయవలయునని ప్రతి జన్మమందపేక్షించినందుచేత నీ ఈశ్వరుడు దయచేసి ఈమనుష్యశరీరమునిచ్చి నన్నుగూర్చినిష్కామ్య తపముచేసి నాయొక్కచరణ సుఖముబొందుమని యాజ్ఞాపించియున్నాడు.

ప్రశ్న. ఆప్రకారమైతే ఎవ్వరున్ను యెందుకు ఆకారణమును దెలిసికొన లేదు ?

ఉత్త. గర్భమునందు కట్టుబడియుండినందుచేత జన్మించుకాలమందు ప్రసూతవాయువు త్రిప్పిత్రోయుటచేతను యోనిద్వారమిరుకు మొదలగు బాధలచేతను, ముందుండిన తలంపంతయు ఈజీవుడుస్మృతి జెంది కొంతకాలము కార్యార్థమీశ్వరునివల్ల తీసుకొన్న పాంచభౌతికమైన శరీరమును దానినిసత్యబుద్ధిచేసుకున్నందుచేత యెవ్వరును ఆకారణమును దెలిసికొనలేరు.

ప్రశ్న. ఐతే కార్యార్థమనుటకుపమానమేలాగు?

ఉత్త. ఒక పురుషుడొకకార్యమును చేయుటకు నుద్దేశించి ప్రక్కయింటివానివద్ద వక కత్తిని కొన్నిదినములు పెట్టుకొనుటకుగాను తీసికొనివచ్చి తక్షణమే ఆకత్తిపైనవుంచబడిన ప్రియమోద ప్రమోదముచేత పరులది, యనుసదిమఱచి స్వంతముగ వలెనెంచుకొని దానివల్లతానుదలచినకార్యములను నెరవేర్చుకొనకవుండెను. అట్లుండగా కొన్నిదినములకు తర్వాత కత్తినిచ్చినవాడు శీఘ్రముగా వచ్చి తనకత్తినియ్యమని యడుగ వీడువానికత్తియనునదిన్ని తాను పరులదితీసికొనివచ్చినదిన్ని మఱచి తర్కించు సమయములో వాడుకోపముచేసుకొని వీనినికొట్టి కష్టపెట్టి కత్తిని లాగుకొని పోవుచున్నాడేగాని కత్తినివిడచిపోజాలడు. ఆప్రకారముగా నీవు ఈశ్వరునివద్ద యనేక జన్మములనుండి వినయముగా నడిగి ఎరవలుగా తీసుకొన్న ఈ శరీరము నిపుడుంబడిన ప్రసవమూర్ఛచేత విస్మృతిజెంది నేను, నాది, యనుసత్యబుద్ధిని స్వీకరించియున్నావు. ఇక నియమప్రకారము ఎరవలుగా యిచ్చిన వారువచ్చితీసుకొనిపోదురు. అపుడు పూర్వమువలెనే తిర్యగాది స్థావరముగా జన్మించి ఆయాసముజెంది ఆగమనము పూర్వముశరీరముండునపుడే సవిహీనతపమొనరించి మోక్షము బొందకపోతిమేయని దుఃఖించుచు నిలచియుండవలెనేకాని వేరేమియులేదు.

ప్రశ్న. అయితే పూర్వమువలెనే ఎరవలుతీసుకొనివచ్చి విస్మృతిజెందక మోక్షము బొందవచ్చునా?

ఉత్త. పునః ఈమనుష్యశరీరము యెత్తుట అరుదు.

ప్రశ్న. అది యేలాగు?

ఉత్త. ముందు కత్తిని ఎరవలుగాతీసుకొనివచ్చి తానుతలంచినకర్మను సంపూర్ణముచేయక, కత్తినిచ్చినవాడువచ్చి యడుగుకాలమందు తనస్వాంతమని తర్కముచేసినది విస్మృతిజెంది పునఃవానిసమీపమునకుబోయి యడిగిన హాస్యగాడని కొట్టి త్రోసి విడుచునేతప్ప యప్పటికినికత్తినిమరల నివ్వడు. ఈరీతిగా ఈశ్వరుడు ఎరవలుగా నిచ్చిన దేహమును నీవు, నేను, నాది, యనియభిమానించి యజ్ఞానముచేత అబద్ధము, హత్య, చోరత్వము, మధ్యపానము, కామము, యీపంచమహాపాతకములలో మునిగి తిర్గుచుండుటచేత మరియొకసారి ఈశరీరము చిక్కుటదుస్తరముగాన ఈశరీరము వివేకము, యీరెండువుండినపుడే ఎరవలుసొత్తని తెలిసి దేహాదిప్రపంచములోనుండు యభిమానములను వదలి నిష్కామ్యతచే మోక్షముబొందవలెనని తెలియుము.

ప్రశ్న. అయితే నేను, నాది, యను యభిమానములేనియెడల వ్యవహారములంతయు నిద్రించువాని హస్తములోని ద్రవ్యముజారినటువలె జారిపడిపోవును గనుక యభిమానముండనిమ్ము అందువల్ల హాని యేమి?

ఉత్త. ఒక గృహస్థుడైన బ్రాహ్మణుడు భార్యతోడ వారణాసి యాత్ర బోవనుద్దేశించి యన్యగృహమందు కాపురముండు నొక బీదబ్రాహ్మణునిపిలిచి మేము వారణాసి యాత్రజేసివచ్చుపర్యంతము మీరు బాడుగలేక మాగృహములో కాపురముండి గృహపశ్వాదుల బదిలముగాసుంచుకొని మేము వచ్చినతోడనే మావద్దొప్పగించితివేని మాసమొకటికి యొక వరహా సంబళము యిచ్చెదనని చెప్పి యాబీదబ్రాహ్మణుని కాపురముంచి కాశ్యాదికన్యాకుమారిపర్యం

తము స్థితిదేవాలయపుణ్యస్థళ, తీర్థ, నిధుల, గ్రామముగా నవలో
కించి కొన్ని దినములు గడచినపిమ్మట తనగృహమునకు భార్యతో
డవచ్చి చేరినాడు. ఆబ్రాహ్మణుని వీక్షించి కాపురమున్న బీద
బ్రాహ్మణుడు మీరెవరని యడుగ మేము నిన్న యీనదినములో
గాపురముంచి కాసియాత్రకుపోయిన వారము గదా యిపుడు
మేము వచ్చి చేరినాము గాన మాగృహ పశ్వాదులన్నియు
మాకప్పగించినీసంబళము తీసికొని పొమ్మనినుడువగా ఆవాక్యము
విని కోపముచేసి గృహమునది యెక్కడిది, కాపురము కూలికి
పెట్టిపోవడ మనునదియేమి నీకేమైనా వున్మాదావస్థయైనదాయని,
ఘంటాఘోషము జేసి నీవుపూర్వమే యీగృహము విక్రయించి
పోయినావే దానికి విక్రయ సాధనమున్నదని యభిమానించి తి
ర్కించి సంభాషింప దానిని విని కాసియాత్ర జేసినవారు న్యాయ
స్థళమునకుబోయి మొరపెట్టగా యామొరనువినిన న్యాయాధిప
తులు వంచకిత్వముచేసిన బీద బ్రాహ్మణుని పట్టుకరమ్మని విచా
రించి నీతడా న్యాయాధిపతుల వీక్షించి వీరు యాత్రకుబోవు నపు
యమందు విక్రయించి పోయినారేకాని నన్ను కాపురముంచి పో
లేదని తప్పుసాధనంచూపింపగా దానినిచూచిన న్యాయాధిపతులు
దీనికి సాక్షిముఖాంతరము కావలెనని ప్రక్కయింటివారిని పిలుపిం
చి మీకు యీసంగతి తెలుసునాయని యడుగ వారు న్యాయా
ధిపతి నవలోకించి వీరిని గాపురముంచి పోయినారేగాని గృహము
విక్రయించలేదని చెప్పినారు దానిని విని న్యాయాధిపతులు ఆ
కపట బ్రాహ్మణుని బట్టి కారాగృహములోనుంచి నీవు నిర్హేతుకము
గా నొకరిద్రవ్యము నపహరించు కొరకు తప్పుసాధనము సృజించి

సందువల్లనీకధికమైన యపరాధము విధింపబడినది. ఈవిధించిన యపరాధము ద్రవ్యవస్తువులు చేరు పర్యంతము కారాగృహములో నుండి యాజ్ఞాపించిన వడ్డీకిగాను చేర్చబడునని న్యాయాధిపతులు తీర్మానించిరి. ఆ ప్రకారముగా దేహాదిప్రపంచ వ్యవహారములో నెవరికైనను నాదియని యభిమానముండెనేని మూలద్రవ్యమైన మోక్షఫలము చెడి వడ్డియైన నిత్యస్వానుభవమున్ను పోయినదా దుఃఖములోనే మునిగియుందురు.

ప్రశ. అయితే అభిమానము తొలగు విధమేమి?

ఉత్త. శరీరమాదిగాగల యంతర్బంధనములను ఈషణత్రయములైన బాహ్యాబంధనములన్యములని తెలసి వానిలో నేను, నాది, యనే యభిమానములు విసర్జించి వీనిని మనకు ప్రారబ్ధమనునది క్రమముగా తొలగించు ననేది సందేహము లేదు. ఇది అంతయు స్వప్నములో కన్న వస్తువులవలె యగునని తలంచి వానిలో ఆగామి కలుగకుండా బ్రహ్మధ్యానమందను దినమభ్యసించుటయే యభిమానము తొలగుమార్గము.

ప్రశ్న. అభిమానము లేకుండా యనుభవించుట యేవిధము?

ఉత్త. చింతపండు బొబ్బడ్డకై వడి తామరదళమందు నిలచిన జలంబుభంగి బురదలోనుండు కుంభకారక్రిమివలె నేను, నాది, యనుబంధము లంటక యుంటక వేదాంత శాస్త్రమును సద్గురుమూలముగా శ్రవణాదులవశ్యము చేయవలసినది సిద్ధము.

—(*) వైరాగ్యప్రకరణముసంపూర్ణము. (*)—



## ॥ ముముక్షు ప్రకరణము

పూర్వము చెప్పిన ప్రకరణమువల్ల దేహాది ప్రపంచ మనిత్యమని యు దేహి ఒకడే నిత్యమని యొక విధముగా తెలసినశిష్యునకు మోక్షాపేక్ష కలుగునటుల ఈడిగువ ముముక్షుప్రకరణము చెప్పుచున్నాడు.

శ్లోకః॥ సద్గురోః కరుణాదృష్టేః। శాస్త్రాభ్యాసవిచారతః। నిత్యసత్య ప్రవ
ర్తస్య। జాయంతే శ్రవణాదయః। శ్రవణాదేస్సముద్భూత। స్త్వను
బంధచతుష్టయః। చతుర్భ్యోప్యనుబంధేభ్యో। మోక్షాపేక్షప్రజా
యతే। అన్వేషయ తశ్శిష్యస్య। స్వయమేవాగతోగురుః॥ తాదృశం
గురు ముద్వీక్ష్య। నమస్కృత్య సుమానసః। ఇమంమాయావృతం
మాతః। పంచకోశైః ప్రవేష్టితం॥ మాంపాహి కృపయాస్వామిన్। 
మాయాదీన్పరిహృత్యచ। అపృథగ్దేహ్యోపదేశ। మేవంసంప్రా
ర్థ్యభక్తిమాన్॥ ఉపవేశయిత్వాఛాత్రం। తర్తుంసంసారవార్నిధిం।
శాంతోదత్వాజ్ఞానదీక్షాం గురుణాప్రయతీకృతః॥

—(*) వీటికివివరము. (*)—

ప్రశ్న. సద్గురువువల్ల శాస్త్రశ్రవణ ముద్భవించుటకు పూర్వమందు చేయ వలసినకార్య మేమి?

ఉత్త. అనుబంధ చతుష్టయములను సంధానము చేయవలయును.

ప్రశ్న. అనుబంధ చతుష్టయము లెవ్వి?

ఉత్త. అధికారవిషయము, సంబంధము, ప్రయోజనమను నాలుగు శాస్త్రారంభమునకు ఫలముగనుక నాలుగు అవశ్యకము.

ప్రశ్న. అది యేలాగు?

ఉత్త. శాస్త్రారంభము చేయుపురుషునకు ఫలలక్షణము గానుండుటయే ప్రయోజనము. ఆప్రకారము ప్రయోజనము లేనియడల యొక దానిలోనైనా ప్రవృత్తియుండనేరదు.

ప్రశ్న. ఈశాస్త్రమున కధికారెవరు?

ఉత్త. సాధనచతుష్టయ సంపత్తిగలవాడును, యుక్తియుక్తుడును, విద్వాంసుడును, మేధావియుగానుండు పురుషుడే అధికారి.

ప్రశ్న. విషయమననేమి?

ఉత్త. జీవబ్రహ్మైక్యముగా నుండే చైతన్యమే విషయము. మరియే స్వరూపమును సకలవేదోపనిష దర్థముల ప్రతిపాదించుచున్నవో అదియే విషయము.

ప్రశ్న. సంబంధమననేమి?

ఉత్త. యిప్పుడు చెప్పబడిన జీవబ్రహ్మైక్యమైన వస్తువునకున్ను, యావస్తువును ప్రమాణముగాఁ జెప్పు శాస్త్రమునకున్ను అభేదముగా నుండుటయే సంబంధము.

ప్రశ్న. ప్రయోజనమననేమి?

ఉత్త. ప్రత్యేకాత్మ బ్రహ్మైక్యానుభవముఁ బొందుటయే యానందము. ఆయానందానుభవముచేత సకలసంసారబంధములఁ దొలగియుండుటయే ప్రయోజనము. ఎవడు సాధనచతుష్టయములను బొందియున్నాడో వానికే యీప్రయోజనము సిద్ధించును. ఈనాలుగు సాధనములలో నొకటి లోపమైనను సిద్ధించదు. యీనాలుగు సాధనములు కలిగినవాడే వేదాంతవిచారమున కధికారి.

ప్రశ్న. ఈసాధన చతుష్టయము లెప్పుడు సంపాదించవలయును?

ఉత్త. శ్రవణమునకంటే పూర్వమే సంపాదించుకొని తదనంతరం శ్రవణమునకు ప్రవేసింపవలయును. లేనియడల జ్ఞానముద్భవించనేరదు.

ప్రశ్న. సాధనచతుష్టయమన నేమి?

ఉత్త. నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థఫలభోగ విరాగము, సమాది షట్కసంపత్తి, ముముక్షుత్వమను నాలుగు.

ప్రశ్న. ఈనాలుగు సాధనములలో నిత్యానిత్య వస్తువివేకమొకటున్న చాలదా? ఎందుకుగాను నాలుగు సాధనములు సంపాదించవలెను?

ఉత్త. ఒకటిచాలదు. ఈలోకములో శాస్త్రజ్ఞులకు నిత్యానిత్య వస్తువివేకము కల్గియుండియు, వారు విషయాసక్తి కలవారై కామ్యకర్మములు జేయుచున్నారు, అందుచేత వారికి నధికారత్వమగుపడలేదుగనుక రెండవసాధనమున్ను గావలయును.

ప్రశ్న. అధికారికి నీరెండు సాధనములు చాలునా?

ఉత్త. చాలవు. కొందరు ఋషీశ్వరులు యీరెండు సాధనములు గలిగియుండియు వారికి కోపతాపములో మునుముంచి యితరులను శపించుటవలన వారికి నధికారత్వమగుపడలేదు. అందుచేత మూడవ సాధనమున్ను కావలయును.

ప్రశ్న. అధికారికి నీమూడుసాధనములు చాలునా?

ఉత్త. కొందరు జడముడివేసి కృష్ణాజనము కటమందుంచుకొని యోగీశ్వరులను నామధేయము గలవారై సంసారమునుంచి వెలువడి విరక్తులుగాను, ప్రశాంతులుగా నుండువారలకు ఈమూడుసాధనములు కలిగిన్ని శ్రవణామన్న లేచిపోవుచున్నారు. కాబట్టి వారికి నధికారత్వము కనుపించలేదు గనుక నాల్గవ సాధనము కావలసియున్నది ఈనాల్గవ సాధనములు కల్గిన వాడే అధికారి, వానికేముక్తి, అందులోనొకటి తక్కువైన ముక్తిలేదు.

ప్రశ్న. నిత్యానిత్య వస్తువివేకలక్షణమేమి?

ఉత్త. బ్రహ్మమేనిత్యము, దేహేంద్రియాది ప్రపంచములంతయు యని త్యమని శ్రుతియు క్తియన్న భవప్రమాణములచే తాదెలుసుకొనుట.

ప్రశ్న. అనిత్యమనుదానిలో శ్రుతిప్రమాణ మేది. ?

ఉత్త. ప్రళయకాలమందు దేహేంద్రియాది ప్రపంచము యావత్తుపృథ్వి లోనడగి ఆపృథ్వితనకంటే పదంతలధికమైన యప్పులోనడగి ఆయ ప్పుతనకంటే పదింతలెక్కువైన తేజస్సులో నడగి ఆతేజస్సుతన కంటే పదంతలధికమైన వాయువులోనడగి ఆవాయువు తనకంటే పదంతలధికమైన యాకాశమునందడగి ఆయాకాశజ్ఞానములో నడ గి ఆయజ్ఞానము బ్రహ్మములో నడుగుటయనునది దెలసుకొను టయే శ్రుతిప్రమాణము.

ప్రశ్న. యుక్తిప్రమాణమేది ?

ఉత్త. పంచభూతములేచేరి భౌతికముగా ప్రతిదినము నసించునని కను గొనుటయే యుక్తిప్రమాణము.

ప్రశ్న. అనుభవ ప్రమాణమేలాగు ?

ఉత్త. జాగ్రదవస్తలో నుండిన బ్రహ్మమైన నామరూపప్రపంచములు స్వ ప్నావస్థలో నుండిన అంతర్మన స్సంకల్పముల యందు లేవు. స్వప్నావస్థలోనుండిన అంతర్మనస్సంకల్పములు సుషుప్త్యవస్థయం దు లేవు. సుషుప్త్యవస్థలో నుండిన యజ్ఞానము, ఆనందము జాగ్ర స్వప్నావస్థలలో లేవని తెలిసి చెప్పుటయే అనుభవ ప్రమాణము.

ప్రశ్న. తదనంతరము బ్రహ్మము నిత్యమని చెప్పుటకుశ్రుతి ప్రమాణమేది ?

ఉత్త. ప్రళయకాలములో పంచభూతములున్ను పంచభూతములకు కా రణమైన యజ్ఞానము బ్రహ్మములో నైక్యమై బ్రహ్మము మా త్రమే శేషించియుండునని తెలిసికొనుటయే శ్రుతిప్రమాణము.

ప్రశ్న. యుక్తిప్రమాణమేది ?

ఉత్త. ఈభూత భౌతికములంతయు ప్రతిదినము నశించి పునరుత్పత్తియ గుటకు గారణమైన బ్రహ్మమొకటియున్నదని తెలుసు కొనుట యుక్తిప్రమాణము.

ప్రశ్న. అనుభవ ప్రమాణమేది ?

ఉత్త. నిత్యత్వమైన బ్రహ్మమే భూతభౌతికములుగ నగపడినదని తెలిసి కొనుటయే యనుభవప్రమాణము. ఇదియె ప్రథమ సాధనము.

ప్రశ్న. ఇహాముత్రార్థ ఫలభోగవిరాగ లక్షణమేది ?

ఉత్త. ఇహములోగలిగిన దార, పుత్ర, ధనధాన్యములలోను, రాజభోగములలోను, పరములోయుండగలదేవతా స్త్రీలవద్దను, అమృతాది స్వర్గభోగములయందును, మల మూత్ర, వాంతి, వీనియందే ప్రకారమెవరికినాశ కలుగదో ఆలాగే పైవానియందు నిరాశ కలగియుండవలయునని శృతి యుక్త్యానుభవ ప్రమాణముచేత నెరుగవలయును.

ప్రశ్న. ఇహలోక భోగమశుద్ధమనుటకు శృతిప్రమాణమేది ?

ఉత్త. దారపుత్రాదులయొక్క శరీరమంత యుచ్ఛిష్టము, మూత్ర, రక్త, మాంస, మలమూత్రములజేరి యొకరూపముగా నిర్మించబడినదని తెలిసికొనుటయె శృతిప్రమాణము.

ప్రశ్న. యుక్తిప్రమాణమేది ?

ఉత్త. మేడిపండుజూచుటకందముగా కనుపడినను అదివిప్పిచూడగా లోపల క్రిములునిండి యసహ్యాముగానుండునటుల, దారపుత్రాదులు చూచుటకు సౌందర్య రూపలావణ్యము గలవారైనను, లోపలమల మూత్రాదిదుర్గంధములు నిండియున్నవని విచారించుటలో నసహ్య

కరమువిపీటినిదాకె నేని తత్క్షణమే శుద్ధిచేసుకొనవలయునని దెలిసి కొనుటయే యుక్తిప్రమాణము.

ప్రశ్న. అనుభవ ప్రమాణమేది?

ఉత్త. వారలకు వ్యాధిపీడలుద్భవించిన కాలములో పుచ్చిష్టము, ము, ట్టు, మలము, చీము, రక్తము, మాంసము, అగుపడుకాలమందు. వారలను తాక నసహ్యాగానుండుటవల్లను వారలుమృతిజెందిన కాలములో అర్ధనిమిషమైన గృహమందుంచక సూతకమని తత్క్షణమె త్తుకొనిపోయి స్మశానములో వేసివచ్చుటచేతను అశుద్ధమని తెలిసికొనుటయే యనుభవ ప్రమాణము.

ప్రశ్న. ద్రవ్యమశుద్ధమనుటకు శృతిప్రమాణమేది?

ఉత్త. ద్రవ్యముసంపాదించు కాలమందు శుద్ధములేక యశుద్ధమైనకార్యములజేయుటకు ప్రయత్నపడుటలో మనస్సుకలుగునని దెలిసికొనుటయే శృతి ప్రమాణము.

ప్రశ్న. యుక్తిప్రమాణమేది?

ఉత్త. ద్రవ్యముచిక్కినకాలమందు భార్య, బిడ్డలు, గృహము, భూము, లను సంపాదించుటకు ప్రయత్నకాలమందు ప్రయత్నమనుపాశ బంధములచేత కట్టుబడి మునిగి నిలచుటను దెలిసికొనుటయే యుక్తిప్రమాణము.

ప్రశ్న. అనుభవప్రమాణమేది?

ఉత్త. ద్రవ్యమధికమైన కాలమందాశ, క్రోధ, లోభ, మదములచేతనాచ్ఛాదింపబడి ముందువెనక దెలియక యజ్ఞానాంధకారమను కూపములోబడి నానావికారముల బొందునని తెలిసికొనుటయే యనుభవప్రమాణము.

ప్రశ్న. పరలోకభోగముల శుద్ధమనుటకు శ్రుతిప్రమాణమేది ?
ఉత్త. మనుష్యులకు గలుగు తాపత్రయములు దేవతలకు సహావుండునని తెలుసుకొనుటయే శ్రుతిప్రమాణము.
ప్రశ్న. యుక్తిప్రమాణమేది ?
ఉత్త. దేవభోగములు మనుష్యభోగములవలె దుఃఖకరములని తెలిసికొనుటయే యుక్తిప్రమాణము.
ప్రశ్న. అనుభవ ప్రమాణమేది ?
ఉత్త. దేవతలు పుణ్యక్షీణమైనతోడనే యధోముఖముగా భూమిమీద బడుటవల్ల యశుద్ధమని దెలిసికొనుటయే యనుభవప్రమాణము. ఇదియే రెండవసాధన.
ప్రశ్న. సమాదిషట్కసంపత్తిలక్షణమేది ?
ఉత్త. శమము, దమము, వుపరతి, తితీక్ష, సమాధానము, శ్రద్ధ, యని యారువిధములు.
ప్రశ్న. శమమనగానేమి ?
ఉత్త. గడచినకాలములో జరిగిన విషయముల నాగమనకాలమందు జరిగే విషయములగురించి చింతించుచున్నది మనస్సు వాటిని చింతించకుండునటుల నిలపినయడల ప్రకృతకాలములోనివిషయములందు మమతకలుగును. ఆలాగు మమతజెందినవిషయములకు విఘ్నముసంభవించెనేని తక్షణమే దుఃఖము సంభవించును. గనుక వాటిలో నొకటియైనదలంచక మనోనిగ్రహము చేయుటేశమము.
ప్రశ్న. దమమనగానేమి ?
ఉత్త. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను విషయాశక్తి జెందనీయకుండుటయే దమము.

ప్రశ్న. ఉపరతియనగేమి?

ఉత్త. చేయబడు సకలకర్మముల ఫలమును బొందవలయునని యపేక్షించి చేసిన పునర్జన్మమెత్తి యాకర్మఫలము లనుభవింప వలసివచ్చును గనుక అట్టికర్మలను భారమనియెంచి త్యజించి ఫలము నపేక్షింపక నీశ్వరార్పణముగా జేయుటయే యుపరతి.

ప్రశ్న. తితీక్షయనగేమి?

ఉత్త. సుఖదుఃఖములు వచ్చునపుడు అవి దేహేంద్రియాదియంతఃకరణములకు స్వభావమని సమముగా జూచి తనకితరులవల్ల సంకటములు కలిగినప్పటికిన్ని వారలనుశిక్షించుటకు సమర్థతయుండియు వారలకు బాధచేయక సహించుకొనియుండుటయే తితీక్ష.

ప్రశ్న. సమాధానమనగేమి?

ఉత్త. ఆర్యులసన్నిధియందు శ్రవణముచేయునపుడు యింద్రియాద్యంతఃకరణములను అంతర్బాహ్యవిషయముల జలింపకుండు విధము నిలుపుటయే సమాధానము. ఈసమాధానము లేనియెడల యుభయభ్రష్టుడౌను.

ప్రశ్న. శ్రద్ధయనగేమి?

ఉత్త. గురువులయందును, వేదాంతశాస్త్రమందును, ఈశ్వరునియందును, నియమముగా భయభక్తివిశ్వాసములనుంచి చిత్తశుద్ధికలిగియుండుటయే శ్రద్ధ. ఇదియే మూడవసాధనము.

ప్రశ్న. ముముక్షుత్వ లక్షణమేది?

ఉత్త. ఈజననమరణరూపమైన సంసారప్రవాహములో శ్రమజెంది యధ్యాత్మిక, యాధిభౌతిక, యాధిదైవిక మనుతాపత్రయముల చేతనొచ్చి యీసంసార దుఃఖములో నొక నిమిషమైన నుండకూడదని

మహాభయముకల్గి యిట్టి భ్రమనేయార్యులు నిందింతురనియు సద్గురువులుగానుండే మహాత్ము లెచ్చటయున్నారోయనియు కాలిన కుండచేయివిడిచినట్లు సకలభోగములను వదలి సన్యాసియై బయలుదేరి మహాలఘుతర పక్వముతో పగలంత ఆచార్యులెచ్చటయున్నారో యని వెదికియు రాత్రియంతయు నిద లేక దుఃఖముచే నిండి చెమటకారుట మొదలగుగాగల ఎనిమిదిగుణములతో దేశాంతరములోను, వనాంతరములోను, పర్వతాంతరములోను, వెదకి యలసి సంచరించుటయే ముముక్షుత్వము. ఇదియె నాలుగవ సాధనము.

ప్రశ్న. ఎనిమిది గుణములు యేవి?

ఉత్త. శ్లో॥ స్వేదోత్పాడనమేవ ఘాతిహితనాహానంద భాష్పంక్రమాత్। తూష్ణీంభావమనంతరించచలనం నాయాతివాక్యోస్ఫుట స్వాంతం శాంతివిహీనమున్నసహితో దేహస్సరో మద్గి మేరాం। ఏతేష్వానివసంతి శ్రీగురువిభురాలోకనే స్వేపణే ॥

ప్రశ్న. ఈప్రకారముగానుండు ముముక్షువునికి గురుదర్శన మేలాగు ప్రాప్తమౌను?

ఉత్త. అనేకజన్మములలో దాను జేసియుండు నిష్కామ్య పుణ్యఫలముచేత అవాఙ్మానస సగోచరమగు బ్రహ్మము తానే దయచేసి యుదకము వడగుండ్లు అయిన విధము మనుష్యరూపమునుధరించి క్షీరసముద్రమువొంగినట్లు వీనిదాహముతీర్చుకొరకు వచ్చురీతి సద్గురువు వచ్చును.

ప్రశ్న. ఆలాగువచ్చిన గురువునుజూచి వీడు చేయవలసినకార్యమేది?

ఉత్త. ఆప్రకారమువచ్చినతోడనే శరీరమంతయు యగ్నిచేతఁ దగ్గలబడి

జలము వెదుకువానికి ముందు గంగానది యెదురు పడినటువలెన్ను ఒక మహాదరిద్రునకు నిధిలభించిన కైవడి మహాసంతోషకరమై సద్భావమునుబొంది యెడుగులేని చెట్టువలె వారియొక్క పాదకమలములయందుబడి త్రికరణశుద్ధిగా సాష్టాంగమాదిగాగల యష్టాంగనమస్కారము లొనరించి రెండుచేతులతో వారిపాదములనుబట్టుకొని స్వామీ నేననేకకాలమునుంచి జననమరణమనుభవాంబుధిలో మునిగి మాయామోహమనెడి యంధకారముచేత గప్పబడి పంచకోశములను పాశములో జిక్కి తాపత్రయాగ్నిచేత దహింపబడి, నిలచినానుగాబట్టి కృపాసాగరులైన స్వాములారా సూర్యకిరణములుసోకి మంచుతొలగిపోవునట్లు యుష్మదీయకృపాకటాక్షముచేత నామనోవేదననపనోదించి చల్లదనము కలుగజేయుకొరకు ప్రసాదము దయచేయ్యవలయునని విన్నవింపవలయు.

ప్రశ్న. ఆప్రకారము చేయుకాలమందు ఆచార్యులొనరించు కార్యమేమి?

ఉత్త. ఆలాగు శరణాగతుడైన శిష్యునిదనంతటివానిగా చేయవలెనని తాబేలురీతిగాదలచి, చాపలభంగి పరిపూర్ణదృష్టిచేత జూచి పక్షికైవడి హస్తమస్తకసంయోగము జేసి తన సన్నిధానమందు కూర్చుండ నియమించి వానిని భయపడకుమని యభయహస్తమిచ్చి వానినొకప్పుడు అహంకారమను మదపుటేనుగువచ్చి చేరకుండునట్లును, మాయామోహములందకుండునట్లును, చిత్తమను శునకము సంచరింపకుండులాగున నిజానందానుభూతికలుగునటుల వేదాంతవిచారమను సింహాసనముపై యారోహణముజేసి ముందు జెప్పిన యహంకారాది మృగముల నావేదాంతధ్వనిచేత లోబడునట్లుజేసి పిదప నిశ్చయాత్మకమైన సూక్ష్మబుద్ధిగల శిష్యునికి బ్రహ్మోపదేశమైన జ్ఞానదీక్ష చేయుటకుపక్రమింతురు.

ప్రశ్న. దీక్షయనగా అర్థమేమి?

ఉత్త. దీయని, క్షయని రెండువిధములు. వాటిలో దీయనగా నదిలోపలి కరణములుగాయుండు మనస్సు, అంహాకారము, చిత్తముపోగా బుద్ధియే యవయవదేహావధాన నిశ్చయము జేయుట, అది యేలాగనిన సర్పము రూపతేజస్సయిన నేత్రములతో శబ్దమును గ్రహించలేకపోయినను యానేత్రములే వాటికి గరణములుగానున్నవని తెలిసికొనక మంత్రశబ్దములను విని యేప్రకారము కట్టుబడుచున్నదో యావిధముగానే బుద్ధి, జ్ఞాన, తేజస్సు తానని తెలిసికొనక యవయవ దేహావధాన నిశ్చయమును గలుగజేయుచున్నది. క్షయనునది సకలకర్మములను నసింపజేసి యాకసమువలె నిర్మలముగా జేయునది. ఈవిధముగా స్థిరమును బొందినదే బ్రహ్మోపదేశమైన జ్ఞానదీక్షయని తెలిసికొనుటయే సిద్ధాంతము.

ముముక్షుప్రకరణము సంపూర్ణము.



# III ఉత్పత్తి ప్రకరణము

-:0:-

పూర్వము చెప్పిన రెండు ప్రకరణములవల్ల మోక్షాపేక్షకలిగి సద్గురులాభమువల్ల శ్రవణాదులబొందిన శిష్యునికి అపరోక్షాత్మానుభవ సమాధిజ్ఞానముగలుగు నిమిత్తము ఉత్పత్తి ప్రకరణమును జెప్పుచున్నారు.

శ్లో॥ శుద్ధబ్రహ్మణినిష్ఠాయాః। మయాయాగుణసన్నిధేః। ఆవిరాసీదవ్యక్తబంధ। ఈశో జీవస్సనాతనః। పంచభూతాః ప్రభూతావై। స్థూలసూక్ష్మంగతాః క్రమాత్। తేషుచీకరణాద్భాంతి। పంచతత్వసమంచితాః॥

——(*) దీని వివరం. (*)——

ప్రశ్న. అఖండ పరిపూర్ణ వ్యాపకములో జగజ్జీవపరంతోచిన దెట్లాగు ?

ఉత్త. శుద్ధబ్రహ్మమైన సర్వసాక్షినుండి యగ్నియందున్న యుష్ణమువలె యభేదమైన యొక చిచ్ఛక్తికలదు. ఆశక్తియతీత బ్రహ్మములో నవ్యక్తముగానుండు కాలమందు ఆయఖండస్వరూప వ్యాపకమునకు శుద్ధబ్రహ్మమనిపేరు. ఆప్రకారమభిన్నమైన చిచ్ఛక్తిభిన్నముగా విజృంభించి శుద్ధబ్రహ్మమును వ్యాపించునపుడు పరాశక్తియనిపేరువచ్చెను. ఆపరాశక్తి మహాకారణ శరీరముతోజేరి యఖండాతీతస్థానమైన తుర్యావస్థకభిమానిగానుండి తత్ప్రకాశమై ప్రకాశించుటవలన పరవ్యాపకమునకు లోబడిన శుద్ధబ్రహ్మమునకు పరబ్రహ్మమని, గురువని, శివమని, నామధేయములు వచ్చినవి. ఇది సామవేదములో మహావాక్యమైన తత్వమసివాక్యమందు చెప్పుచున్నది. ఇదియే అసిపదార్థమైన శివతుర్యము. ఈ ప్రకారమవయవరహితముగానుండు పరాశక్తినుండి బ్రహ్మసన్నిధానవిశేషముచేత సత్వరజస్తమమనుయవికృత త్రిగుణములుద్భవించునవి.

ప్రశ్న. ఆగుణములకు నామమేది ?

ఉత్త. సత్వమున కానందరూపశక్తియనియు, రజునకు చిద్రూపశక్తియనియు, తమస్సునకు సద్రూపశక్తియనియు నామములుగలిగెను.

ప్రశ్న. ఆపరబ్రహ్మము సత్వగుణములో ప్రతిఫలించినపుడు నామమేద్ది ?

ఉత్త. ఆనందరూపశక్తియైన కారణశరీరముతో జేరి యుపశాంతస్థానమైన సర్వానందసుషుప్త్యవస్థ కభిమానిగానుండి సర్వముదానుగా బ్రకాశించియుండుటను మఱచి యుపశమనముగానతీతము నయుండుటవలన నాపరబ్రహ్మమునకు బ్రహ్మానందుడనిన్ని, శాంతుడనిన్ని, నామధేయములుగలిగెను. ఇదియేఅసిపదార్థమైన శివసుషుప్తి.

ప్రశ్న. బ్రహ్మానందుడు రజోగుణమునందు ప్రతిఫలించునపుడు నామమేమి?

ఉత్త. చిద్రూపశక్తియైన సూక్ష్మశరీరముతోచేరి విశ్వగ్రాహిస్థానమైన సర్వప్రకాశ స్వప్నావస్థకభిమానిగానుండి సకల భువన చరాచర ప్రపంచములను దనలోపలి నైక్యముచేసుకొని తానేజగత్స్వరూపముగా బ్రకాశించుచుండుటవలన నాబ్రహ్మానందునికి తేజోమయుడనిన్ని, ప్రజాపతియనిన్ని, నామధేయములయ్యెను. ఇదియే అసిపదార్థమైన శివస్వప్నము.

ప్రశ్న. తేజోమయుడు తమస్సునందు ప్రతిఫలించునపుడు నామమేమి ?

ఉత్త. సద్రూపశక్తియైన స్థూలశరీముతో గూడి సంపూర్ణస్థానమైన సర్వవ్యాపక జాగ్రదవస్థకభిమానిగానుండి సర్వచరాచరప్రపంచములలో తానే ప్రకాశించుటవల్ల నా తేజోమయునికి, బరిపూర్ణుడనిన్ని చిత్స్వరూపుడనిన్ని, నామధేయమయ్యెను. ఇదియే అసిపదార్థమైన శివజాగ్రత్త.

—(*) అసిపదం సంపూర్ణము. (*)—

—(౧) తత్పదం. (౦)—

ప్రశ్న. పరిపూర్ణ బ్రహ్మమన్నిధియందు చేష్టించినదేమి ?

ఉత్త. ఆ శక్తియందు రజతభ్రాంతివలె మూలప్రకృతియను నొక శక్తివివర్ధముగా చేష్టించినది. ఆశక్తిలో పరిపూర్ణుడు వ్యాపించియుండుట వలన ఆమూల ప్రకృతిలో బ్రహ్మ[illegible] సత్వరజస్తమములను వికృతత్రిగుణములు గలిగెను.

ప్రశ్న. ఆత్రిగుణము లెవ్వి ?

ఉత్త. మాయయని[illegible] ప్రకృతియనియు చెప్పబడును. [illegible]యందు నిర్మలదర్పణమునందు సూర్యుడు ప్రతిఫలించిన రీతి పరిపూర్ణుడు సలక్షణముగా ప్రతిఫలించెను. ఆప్రతిబింబ మాయ చైతన్యమునకు నీశ్వరుడని నామధేయము. ఆమాయమహాకారణ శరీరముతో జేర బ్రహ్మాండస్థానమైన తుర్యావస్థకభిమానిగానుండి సకల చరాచర ప్రపంచముతో మిళితమైయుండుటవలన నాపరిపూర్ణమునకు నీశ్వరసాక్షియైన బ్రహ్మమనియు, సర్వజ్ఞుడను నామధేయములాయెను. ఇందుకుజ్ఞానశక్తి సుఖనైశ్వర్యసంపన్నత్వ భోగము ఓంకారాక్షరము. ఈయక్షరములో సకలమైక్యమైయుండుటవలన దీనినధిష్టించిన బ్రహ్మచైతన్యమునకు మహాత్మయని సూక నామమాయెను. ఇదియే తత్పదార్థమైన పరతత్వము.

ప్రశ్న: అయితే [illegible] యెట్లుద్భవించిరి ?

ఉత్త. సత్వగుణ [illegible] త్రిలోకము లుత్పత్తి యాయెను. వానిలో [illegible] ప్రధానమైనదై యవ్యాకృత

మైనకారణ శరీరముతోఁ జేరి యగ్నిస్థానమైన సుషుప్త్యవస్థకభిమా
నిగానుండి సకల ప్రపంచములను సంహారముచేసి నిలుచుటవల్ల
ఆయభిమానికి అవ్యాకృతుడనియు, రుద్రుడనియు, నామధేయము
లాయెను. దీనికి తిరోధాయశక్తి సర్వసంహారభోగము మకారాక్ష
రము. ఈ యక్షరములోనివి యైక్యమై యుండుటచేత దీనినధిష్ఠిం
చియుండిన ఈశ్వరునకు శుద్ధాత్మయని యొక నామధేయము
వచ్చినది. ఇదియే తత్పదార్థమైన పరసుషుప్తి. సత్వగుణప్రధాన
మైనటువంటిదై హిరణ్యగర్భమైన సూక్ష్మశరీరముతో సంగతమై
చంద్ర స్థానమైన స్వప్నావస్థ కభిమానిగానుండి సకల ప్రపంచము
లను రక్షించుటంజేసి ఆయభిమానికి హిరణ్యగర్భుడనిన్ని, విష్ణు
వనిన్ని నామధేయములాయెను దీని కిచ్ఛాశక్తి సర్వభావకర్తృత్వ
భోగము ఉకారాక్షరము. ఈ అక్షరములోనివి యైక్యమై యుం
డుటంబట్టి దీనినధిష్ఠించియుండిన ఈశ్వరునికి సూత్రాత్మయని యొ
కనామధేయ మాయెను. ఇదియే తత్పదార్థమైన పరస్వప్నము త
జోగుణ ప్రధానమై నటువంటిదై విరాట్టయిన స్థూలశరీరముతో
గూడి సూర్యస్థానమైన జాగ్రదవస్థ కభిమానిగానుండి సకలచరా
చర ప్రపంచములను సృజించుటవల్ల ఆయభిమానికి విరాట్టనియు,
బ్రహ్మయనియు, నామములాయెను. దీనికి క్రియాశక్తి సర్వక
ర్తృత్వభోగము అకారాక్షరము. [illegible]లోనివి యైక్యమై
యుండుటవల్ల దీనిని [illegible] సర్వభూతాత్మ
[illegible]నపరజాగ్రత్త.



—:0:—

## —(*) త్వం పదం (*)—

ప్రశ్న. రజోగుణ అవిద్యయొక్క కార్యమేలాగు ?

ఉత్త. అవిద్యయందు మలిన జలములో సూర్యుడు ప్రతిఫలించు చందం బున బ్రహ్మచైతన్యము బ్రతిఫలించును. ఆ ప్రతి ఫలించుటకు జీవుడని నామధేయము. ఆయవిద్యయైన మహాకారణ శరీరము తో జేర్చి లలాట స్థానమైన తుర్యావస్థ కభిమానిగానుండి యవస్థా త్రయ విలక్షణ జ్ఞానస్వరూపముగానుండుటవల్ల నాబ్రహ్మచైతన్య మునకు జీవసాక్షియైన కూటస్థుడనియు, ప్రత్యేకాత్మయనియు నా మధేయములు గలిగెను. ఇందుకు జ్ఞానశక్తి ఆనంద పరవశభో గము ఓంకారాక్షరము. ఈయక్షరములలోనివి వైక్యమైయుం డుటవల్ల ఆయాత్మకు నిర్మలాత్మయని యొక నామమాయెను. ఇదియే త్వంపదార్థమైన జీవతుర్యము.

ప్రశ్న. అయితే త్రివిధములైన యాత్మలేప్రకార ముద్భవించెను ?

ఉత్త. రజోగుణ విద్యలో సత్వరజస్తమములను త్రిగుణము లుత్పత్తియ య్యెను. వానిలో తమోగుణమే ప్రధానమై నటువంటిదై యా నందమయకోశమైన గారణ శరీరములోగూడి హృదయస్థానమైన సుషుప్త్యవస్థకభిమానిగానుండి సుషుప్తి సుఖమనుభవించుటవల్ల ఆయభిమానికి [illegible]డనియు, పారమార్థికుడనియు, అపరిచ్ఛిన్ను డను నా[illegible] ఇందుకు తిరోధాయశక్తి ఆనంద భోగము[illegible]లోనివి వైక్య మైయుండుటంబట్టి [illegible]కు పరమాత్మయని యొక నామమాయెను. యిది[illegible]మైనజీవసుషుప్తి. సత్వగుణమే

ప్రధానమై నటువంటిదై ప్రాణ[illegible] కోశత్రయములైన సూక్ష్మ శరీరముతో మిళితమై కంఠస్థానమైన స్వప్నావస్థకభిమానిగానుండి స్వప్నప్రపంచములో జేరియు చేరకయుండుటవల్ల నాయభిమానికి తైజసుడనియు, ప్రాతిభాసికుడనియు, స్వప్నకల్పితుడనియు నామధేయములాయెను. దీనికిచ్ఛాశక్తి అయుక్తభోగము. (ఫలనసాన భేదాభేదములు లేక యనుభవించుట.) ఉకారాక్షరము ఈ యక్షరములోనివి యైక్యమైయుండుటవల్ల దీని నధిష్టించిన యాత్మకు నంతరాత్మయని యొక నామమాయెను. ఇదియే త్వంపదార్థమైన జీవస్వప్నము. రజోగుణమే ప్రధానమైనటువంటిదై యన్నమయకోశమైన స్థూలశరీరముతో జేరి నేత్రస్థానమైన జాగ్రదవస్థకభిమానిగానుండి ప్రపంచవ్యవహారములో ప్రయత్నపడియుండుటవలన ఆయభిమానికి విశ్వుడనియు, వ్యవహారికుడనియు, కించజ్ఞుడనియు, చిదాభాసుడను నామములాయెను. ఇందుకు క్రియాశక్తిలోకాభిమానముచేత మంచి నెబ్బరయని తెలిసి యనుభవించుటనుబట్టి యుక్తభోగం అకారాక్షరం. ఈయక్షరములోనివి యైక్యమైయుండుటచేత దీనినధిష్టించియుండిన యాత్మకు జీవాత్మయని యొక నామధేయమాయెను. ఇదియే త్వంపదార్థమైన జీవజాగ్రత్త.

—(*) త్వంపదం సంపూర్ణము. (*)—

———(o)———

ప్రశ్న. తామసగుణ ప్రకృతికార్యమెట్టిది?

ఉత్త. ప్రకృతియందావరణము, విక్షేపమని రెండు శక్తులుగలవు. వానిలో నావరణమనునది తత్వజ్ఞానులను ఈశ్వరుని తప్ప తదితరజీవుల

కందరికి శరీరత్రయము. జీవుడు సాక్షి చైతన్యము వీటికి భేదములు తెలియకుండ మఱుపుగలిగించును. ఈయావరణమునుంచి విడు పించుకొనుటయే ముక్తి. తమోగుణప్రధానమైన విక్షేపశక్తియే మహాకారణ ప్రపంచముగా నిల్చినది. విక్షేపశక్తియందు సత్వ రజస్తమమను త్రిగుణములు సమముగానుండును. వాటిలో తమ స్సు ప్రధానమైనపుడు కారణ ప్రపంచము సత్వగుణ ప్రధానమై నపుడు సూక్ష్మ ప్రపంచము రజోగుణ ప్రధానమైనపుడు స్థూల ప్రపంచము గలిగెను.

ప్రశ్న. వాటికి వివరమేలాగు ?

ఉత్త. సత్వగుణమాయలో ప్రతిఫలించిన ఈశ్వరుడు నిర్మల జలములో ప్రతిబింబించిన సూర్యునివలె నొకడుగాను, సర్వజ్ఞుడుగాను యుం డును. రజోగుణావిద్యలో ప్రతిబింబించిన జీవులు అవిద్యాయ నేకముగా నుండుటవలన మలిన ఘటజలములో ప్రతి బింబించిన యనేక సూర్యులవలె ననేకులుగాను కించిజ్ఞులుగానుందురు. ఆప్ర కారమవిద్యయందు ప్రతిఫలించిన జీవులకు సర్వజ్ఞుడైన ఈశ్వరుడు కృపచేసి శరీరత్రయములిచ్చి ముక్తి బొందునట్లుతలంచి తమోగు ణమయిన ప్రకృతిని రెండుభాగములు జేసిన మొదటి భాగములో నావరణశక్తియును, రెండవభాగములో విక్షేపశక్తియును, గలి గించెను. ఆప్రకృతి యొక్క వివేకమే మహాకారణ శరీరము. దానిలో ప్రతిబింబించిన జీవుడే కూటస్థుడు. దానిని దెలియక యుండడమే యానందమయకోశమయిన కారణశరీరము. ఇటు వంటి ఆవరణశక్తి జీవతుర్యములోయుండు కూటస్థుని ఈశ్వరుని తప్ప తదితర జీవులకందరికి స్థూల, సూక్ష్మ,కారణ శరీర భేదములను

వాటియభిమానులకు, సాక్షిచైతన్యముల నొకటి కొకటి భేదము తెలియకుండ నటుల మఱపించును. అందుచేత మరుగుపడిన జీవులీయిరువది తొమ్మిది తత్వములను దామనియభిమానించెదరు. ఆయభిమానము నహంకార గ్రంథియని సంసారబంధమని చెప్పుచున్నారు.

ప్రశ్న. అయితే ముక్తిప్రాప్తియేలాగు?

ఉత్త. సద్గురుకటాక్షముచేత నావరణమును వదలి యిరువది తొమ్మిది తత్వములకుండ గల భేదముల దెలుసుకొనడమే ముక్తిం బొందుటకుపాయము.

ప్రశ్న. విక్షేపశక్తికార్యమేది?

ఉత్త. విక్షేపశక్తియు, సత్వరజస్తమమును త్రిగుణసహితముగానుండును. (అశక్తిలో శబ్దతన్మాత్రమైన ఆకాశములో స్పర్శతన్మాత్రమైన వాయువు,) వాయువులో రూపతన్మాత్రమైన తేజస్సు, తేజస్సులో రసతన్మాత్రమైన యప్పు, అప్పులో గంధతన్మాత్రమైన పృథ్వియుకలిగెను. ఈ పంచతన్మాత్రలకు అపంచీకృత పంచ మహాభూతములని, సూక్ష్మ భూతములని చెప్పబడును. ఈ సూక్ష్మ భూతముల నుంచి సూక్ష్మ శరీరములును స్థూల శరీరములును గలిగెను.

ప్రశ్న. అదియేలాగు?

ఉత్త. ఈఆకాశము మొదలైన సూక్ష్మభూతములలో త్రిగుణములు గలిగియున్నవి. ఆసూక్ష్మభూతమందు సత్వాంశములో నొక్కొక్క భూతమునకు నొక్కొకమాత్ర తీసుకొని సమష్టిగా చెప్పనయ్యెంతఃకరణములు.

ప్రశ్న. అంతఃకరణములలో నాకాశముచేరినందుకు చిహ్నమేది?

ఉత్త. అంతఃకరణము లాకాశము వలె సకలవిషయముల కవకాశమిచ్చి యుండుటయే చిహ్నము. అట్లు ధరించు వృత్తికి దేజస్సైన సజ్ఞాత యని నామధేయము.

ప్రశ్న. వాయువాంశము మిళితమైనందుకు చిహ్నమేది ?

ఉత్త. వాయువువలె చలించుటయే చిహ్నము. అట్లు చలించువృత్తికి మన స్సనినామము.

ప్రశ్న. తేజోంశము కూడినందుకు లక్షణమేది ?

ఉత్త. తేజస్సువలె విషయముల నిదియదియని వివరించుటయె చిహ్నము. ఈప్రకారము వివరించు వృత్తికి బుద్ధియని నామధేయము?

ప్రశ్న. అప్పు అంశము చేరినందుకు చిహ్నమేది ?

ఉత్త. అప్పువలె సకల విషయములలో తగిలి యుండుటయె చిహ్నము. ఆలాగు తగిలియుండు వృత్తికి చిత్తమని నామధేయము.

ప్రశ్న. పృథ్వ్యంశములో మిళితమైనందుకు లాంఛనమేది ?

ఉత్త. పృథ్వివలె సకల విషయములలో గఠినముగా నభిమానించి యుండుటయె లాంఛనము. ఆప్రకార మభిమానించియుండు వృత్తికి నహంకారమని నామధేయము. ఈ విధముగానే ఆసూక్ష్మభూతముల యొక్క సత్వాంశములో నొక్కొక్క భూతమునకు నొక్కొక్కమాత్రమె త్రివృష్టిగానుంచినది జ్ఞానేంద్రియములని జెప్పబడును.

ప్రశ్న. జ్ఞానేంద్రియముల గుణమేది?

ఉత్త. శ్రోత్రమాకాశాంశమైనందుకు ఆకాశగుణమైనశబ్దము మాత్రము దెలుసుకొనును. త్వక్కు వాయు అంశమైనందున వాయుగుణ

మయిన స్పర్శమును మాత్రము గనుగొనును. చక్షువు తేజోంశ మయినందున దేజోగుణమయిన రూపముమాత్రము గనుగొనును. జిహ్వ ఆపో అంశమయినందున అప్పుగుణమయిన రస మెరుగును. ఘ్రాణము పృధ్వ్యంశమయి నందున పృథ్వి గుణమయిన గంథము మాత్రము గ్రహించును. ఈ యైదింద్రియములు లొకటితో నొకటిచేరక యుండుటవలన నితరభూతములను గ్రహించి తెలిసికొన జాలవు. అంతఃకరణములలో నైదుమాత్ర లొకటిగా జేర్చినది కాబట్టి యైదింద్రియములచేత నైదువిషయములను గ్రహించు చున్నది. ఈసత్వాంశ సమష్టిలో గలిగిన యంతఃకరణము లైదున్ను వ్యష్టిలో గలిగిన జ్ఞానేంద్రియము లైదున్ను అంతఃపరిజ్ఞానసాధనమగుటచేత దెలిసికొను యింద్రియములు. ఈప్రకారము ఆసూక్ష్మభూతములు రజోంశములో నొక్కొక్క భూతమునకు నొక్కొక్క మాత్రతీసికొని సమష్టిగా నొకటిగాజేర్చినవి ప్రాణాది పంచవాయువులు.

ప్రశ్న. ప్రాణాది పంచవాయువుల గుణమేది?

ఉత్త. వ్యానవాయువు ఆకాశముయొక్క యంశముగా నుండుట వలన నాకాశమువలె సర్వశరీరమును వ్యాపించియుండును. ప్రాణవాయువు వాయువుయొక్క యంశముగానుండుట వలన వాయువువలె హృదయ స్థానమునుండి నాసికాపర్యంతరము దిరిగివచ్చును. అపానవాయువు యగ్న్యంశము గనుక యగ్నివలె జఠరాగ్నిగా జ్వలించి గుదస్థానమందు నిల్చి యన్నపానంబులను జీర్ణింప జేయును. సమానవాయువు అప్వంశముగానుండుటవలన అప్పువలె

శరీరమధ్యనాభిస్థానమందునొప్పి యున్న పానాదులను సకలనాడుల యందు నింపించును.

ప్రశ్న. ఈపంచవాయువులుగాక వేరే వాయువులున్నవా?

ఉత్త. వమనమువచ్చునట్లు జేయునది నాగమనియు, ఉన్మీలనము జేయునది కూర్మమనియు, క్షుతము (తుమ్ము)ను గలుగ జేయునది కృకరమనియు, విజృంభణము (ఆవలింత)ను గలుగ జేయునది దేవదత్తమనియు, మృతశరీరమును సహావదలక నుబ్బ జేయునది ధనంజయమనియు నైదువాయువులున్నవని కొందరు చెప్పుచున్నారు. ఈ యైదున్ను ప్రాణవాయువు సంబంధమయినవే కాని వేఱుకావు. ఆసూక్ష్మభూతముయొక్క రజోంశములో నొక్కొక్కభూతములో నొక్కొక్కమాత్ర తీసికొని వ్యష్టిగా నేర్పాటుచేసినవే కర్మేంద్రియములు.

ప్రశ్న. కర్మేంద్రియ గుణములెవ్వి?

ఉత్త. వాక్కు ఆకాశముయొక్క గుణముగనుక యాకాశమునుండి సంభాషించును. పాణివాయు వ్యంశముగనుక వాయువునుండి తీసికొనుట యిచ్చుట జేయును. పాదము యగ్న్యంశముగనుక అగ్నిలోనుండి నడుచును. ఉపస్థ అప్వంశముగనుక యప్పులోనుండి యానందించును. గుదేంద్రియము పృథ్వ్యంశముగనుక పృథ్విలో మలవిసర్జనము జేయును. ఈయైదొకటితో నొకటి చేరక యుండుటచేత యితర కార్యముల జేయజాలవు. వాయువులో నైదుమాత్ర యొకటిగాజేరి యుండినందున పంచకర్మేంద్రియముల వల్ల పంచకార్యముల జేయుచున్నవి. ఈరాజ సమష్టిలో పంచవాయువులున్ను వ్యష్టిలోగలిగిన పంచ కర్మేంద్రియములున్ను

వెరశి పదియుగర్మసాధనము గనుక కార్యములజేయునట్టియింద్రియములు. ఈవింశతి తత్వములే సూక్ష్మశరీరములు దీనిని మాయాప్రతిబింబుడైన ఈశ్వరుడవిద్యా ప్రతిబింబుడైన జీవునికి సృష్టికొఱకు శరీరము నిచ్చుచురాగలడు. ఈప్రకారము సూక్ష్మశరీరము బొందని జీవులను పునఃసృష్టిలో నివ్వగలడు. ఈసూక్ష్మశరీరాభిమాన జీవునకు తైజసుడని నామధేయము. ఈవిధముగానే పంచభూతములయొక్క సాత్వికాంశమున్ను, రాజసాంశమున్నుపోగా తామసాంశము మాత్రము నిల్చునది. ఇదియె సూక్ష్మశరీరోత్పత్తి.

ప్రశ్న. స్థూలశరీరోత్పత్తి యేలాగు?

ఉత్త. శేషించిన తామసాంశములో నైదుభూతముల నొక్కొకటిని ద్విభాగములుగా జేసి మొదటి యర్ధభాగమైదున్ను, ఒకటి నాలుగు జేసి ద్వితీయార్థము తనయంశముతో జేర్పక మిగిలిన చతుర్భాతములలో భూతమునకు పరక పరక మాత్రముగా నిచ్చుటయే పంచీకరణము.

ప్రశ్న. ఈపంచీకరణము జేసినందుకు ప్రయోజనమేమి?

ఉత్త. పంచీకరించిన స్థూలభూతములలో యాకాశమందు స్పర్శ, రూప, రస, గంధములు నాల్గుగుణములు వ్యాప్తములుగనుక యదృశ్యమై నిజగుణమైన శబ్దము దృశ్యమాను. వాయువులో త్రిగుణములైన రూపరసగంధములు వ్యాప్తమై యదృశ్యమౌటవలన గారణగుణమయిన శబ్దము నిజగుణమయిన స్పర్శము దృశ్యమగును తేజస్సులో ద్వివిధగుణములైన రసగంధములు వ్యాప్తమయి యదృశ్యమగుటవలన గారణగుణములైన శబ్దస్పర్శములున్ను, నిజగు

ణమయిన రూపముదృశ్యమౌను. అప్పులో గంధగుణ మొకటి వ్యాప్తకమయి యదృశ్యమగుటవలన కారణగుణమయిన శబ్దస్పర్శరూపములున్ను నిజగుణమయిన రసముదృశ్యమౌను. పృథ్విలో శబ్దస్పర్శరూప రసగంధములు నిజగుణములు గనుక దృశ్యమౌను. ఇవియె స్థూలపంచభూతములు.

ప్రశ్న. ఈస్థూలపంచ భూతములవల్ల గలిగిన వేవి?

ఉత్త. షట్తత్వములయ్యెను, చతుర్విధములైన యోనులయ్యెను, (సప్తవిధములైన యోనులయ్యెను.) సప్తవిధములైన జన్మములుగలది స్థూలశరీరము.

ప్రశ్న. షట్తత్వములేవి?

ఉత్త. చర్మము, రక్తము, మాంసము (జనాయువు) నరములు, అస్థి, మజ్జ, (క్రొవ్వు) అని యారువిధములాయెను.

ప్రశ్న. చతుర్విధములయిన యోనులేవి?

ఉత్త. అండజ, ఉద్భిజ్జ, స్వేదజ, జరాయుజమని నాల్గువిధములు.

ప్రశ్న. సప్తవిధములైన జన్మములెవ్వి?

ఉత్త. దేవతలు, మనుష్యులు, పక్షులు, మృగములు, భూమిమీదప్రాకెడు జంతువులు; జలచరములు, స్థావరములు. ఇవి 84 లక్షలభేదములుగానుండును. ఈశ్వరుడు జీవులకీ స్థూలశరీరమును నిర్మించి యున్నాడు. ఈవ్యష్టిస్థూలశరీరము నభిమానించిన జీవునకు విశ్వుడనియు, సమష్టిస్థూలవిరాట్టు నభిమానించిన ఈశ్వరునకు బ్రహ్మయనియు నామధేయము. వ్యష్టిసూత్మశరీరము నభిమానించిన జీవునకు తైజసుడనియు, సమష్టిసూత్మ హిరణ్యగర్భశరీరము నభిమానించిన ఈశ్వరునకు విష్ణువనియు, నామధేయము. వ్యష్టి

కారణ శరీరము నభిమానించిన జీవునకు ప్రాజ్ఞుడనియు, సమష్టి కారణావ్యాకృతశరీరము నభిమానించిన ఈశ్వరునకు రుద్రుడని యు, నామధేయము. ఇవియె జీవేశ్వర శరీరత్రయములు గలిగిన మార్గమని చెప్పబడును. ఇంక విచారజ్ఞానముచేత శరీరత్ర యములనులయము జేసిసాక్షియైనతానుండుస్థితిదెలుసుకొనవలెను.

ప్రశ్న. సద్గురు సన్నిధానమునందు శాస్త్రములవల్ల జీవాదిశరీరత్రయము లను విచారించు పురుషుడెవడు?

ఉత్త. ఈవిశ్వతైజసప్రాజ్ఞుడను వీరలచేత విచారించుదామనిన నాయా యవస్థలతో నాయాయభిమానులు లయమగుటచేత వారలచేత విచారించబడు జ్ఞానమున కనిత్యముకలుగును. గనుక జీవతుర్య ములోనుండు కూటస్థుడే విచారించుపురుషుడు.

ప్రశ్న. ఆవిచారించు విధము యేలాగు?

ఉత్త. జీవునికి వాచ్యలక్ష్యార్థమయిన యశుద్ధశుద్ధముల నీశ్వరునికి వా చ్యలక్ష్యార్థమైన యశుద్ధశుద్ధములనువిభజించి తెలుసుకొనుటయే.

ప్రశ్న. జీవునికి వాచ్యార్థమయిన యశుద్ధమేది?

ఉత్త. స్థూలశరీరములో జ్ఞానేంద్రియపంచక మొకటి కర్మేంద్రియ పంచ కమొకటి వీటిని విభజించి తెలిసికొను నంతఃకరణములు నాలుగు వీటినన్నిటిని జేరికజేయు ప్రాణాది పంచక మొకటి; యీ ఏడును కార్యోపాధి. ఈ యేడుపాధులను దాననిజీవుడభిమానించినదే త్వంపదయశుద్ధము.

ప్రశ్న. జీవునికి లక్ష్యార్థమయిన శుద్ధమేది?

ఉత్త. ఈ ఏడుపాధులు తానుగానని వదలి వాటికి సాక్షిగానుండుటయే త్వంపదశుద్ధము.

ప్రశ్న. ఈశ్వరునకు వాచ్యార్థమయిన యశుద్ధమేది ?

ఉత్త. సర్వజ్ఞుడు, సర్వకారణుడు, సర్వాంతర్యామి, సర్వేశ్వరుడు, సర్వసృష్టి, సర్వస్థితి, సర్వసంహారము, అను నీయేడున్ను కారణోపాధులు. ఈయేడు పాధులను దాననియీశ్వరుడభిమానించినదే తత్పద అశుద్ధము.

ప్రశ్న. సర్వజ్ఞుడనునది యేది ?

ఉత్త. సకలప్రపంచములలోను వ్యాపకమయ్యిన కార్యములంతయు తెలిసి నిలుచుటయే.

ప్రశ్న. సర్వకారణుడనుట యేది ?

ఉత్త. సర్వజగములు నాశనమయియున్న్ని తాను నాశనము కాకుండా నిత్యుడుగా నుండుటయే.

ప్రశ్న. సర్వాంతర్యామి యనగేమి ?

ఉత్త. సర్వజగద్విశాలమయిన దేహేంద్రియాదులకు లోవెలి నిండి యుండుటయే.

ప్రశ్న. సర్వేశ్వరుడననేమి ?

ఉత్త. సకల ప్రపంచములకు కర్తగా ప్రకాశించియుండుటయే.

ప్రశ్న. సర్వసృష్టియననేమి ?

ఉత్త. సర్వచరాచర ప్రపంచములను సృష్టించి నిలుచుటయే.

ప్రశ్న. సర్వస్థితి యననేమి ?

ఉత్త. సర్వజగములను పరిపాలనజేసి నిలుచుటయే.

ప్రశ్న. సర్వసంహారమననేమి ?

ఉత్త. సర్వజగద్విలాసములున్ను తనలోపులనణగి నిలుచుటయే.

ప్రశ్న. ఈశ్వరుని లక్ష్యార్థమయిన శుద్ధమేది ?

ఉత్త. ఈ ఏడు పాధులు దాను గానని త్యజించి వీనికి సాక్షిచైతన్యముగా నుండుటయే తత్పదశుద్ధము.

ప్రశ్న. సంపూర్ణస్థితియేది ?

ఉత్త. త్వంపదశుద్ధమైన జీవతుర్యము తత్పదశుద్ధమైన పరతుర్యము. ఐక్యమైన శివతుర్యమని తెలిసినిలుచుటయే సంపూర్ణస్థితి, మఱియు తత్పద, త్వంపద, శుద్ధములను ముఖ్యవస్తువులనిన్ని తత్పద, త్వంపద, శుద్ధములను లక్ష్యవస్తువులనిన్ని కొన్ని శాస్త్రములలో జెప్పబడును.

ప్రశ్న. వీటికి లక్షణవాక్యమేది ?

ఉత్త. విడచిన లక్షణమునకు సంసర్గవాక్యమనిన్ని, విడువని లక్షణమునకు విశిష్టవాక్యమనిన్ని విడచివిడువని లక్షణమునకు అఖండవాక్యమనిన్ని, వాక్యత్రయములుగలవు. ఈ వాక్యార్థముల ప్రకారము చింతించియుండుచేత కలుగు యనుభవమును జెప్పవలెనని యనుగ్రహముచేసి యాచార్యుడు మౌనానందముగానుండు సమయములో శిష్యుడంతర్దృష్టియై స్వరూప సమాధిబొంది యపరోక్షాత్మానుభూతిబొంది చెప్పరాని సంతోషముతో లేచి నిలచియాయాచార్యునకు ప్రదక్షిణ నమస్కారంబు లాచరించి యంజలిహస్తుడై నిల్వగా నాయాచార్యులున్ను తను పూర్ణదృష్టిచేత సచ్ఛిష్యునిజూచి, ఆదరణముజేసి వానిని సమీపమునకుం బిలచి స్వానుభవ మడుగుచున్నారు. అది ఏలాగనిన:

ప్రశ్న. వత్సానీస్వానుభవమేది ?

ఉత్త. స్వామీ జీవోపాధియైన కార్యోపాధులు యేడుచేతనుగూడి నిల్చిన స్థూలదేహము నభిమానించినవాడు విశ్వుడని, యిదియే జీవ

జాగ్రమని జూచినాను. ఈయేడుపాధులలో నింద్రియములైన రెండుపాధులువదలి కరణములు నాలుగు ప్రాణాదులొకటియైన నైదుపాధులతోఁగూడిన సూక్ష్మదేహము నభిమానించినవాఁడు తైజసుఁడని యిదియే జీవస్వప్నమని చూచినాను.* ఈయైదు పాధులతో కరణములు నాలుగువదలి ప్రాణాదియైన యొక యుపాధితో నిల్చిన కారణశరీరము నభిమానించినవాఁడు ప్రాజ్ఞుండని, యిదియేజీవ సుషుప్తియని జూచినాను. ఈయేడుపాధులులయమై జీవసాక్షీ మాత్రముగా శేషించి నిల్చిన జీవతుర్యమునుజూచినాను. తుర్యమయిన బోధయులయమయి విశ్వ స్వరూపమయిన సర్వసాక్షిగానుండు పరజాగ్రముజూచినాను. గోలుసు చేరికవలె సకలప్రపంచములును వేఱుగా కనిన జ్ఞానముమాత్రము తానుగానుండే పరస్వప్నమునుజూచినాను. చూచువాఁడు చూడబడినవి వదలిపోయి సర్వమును కనపడకుండు పరసుషుప్తిని జూచినాను; ఆసుషుప్తిని దెలిసిన జ్ఞానమయిన పరతుర్యమునుజూచినాను. కూటస్థుఁడున్ను బ్రహ్మమున్ను ఒకటియని తెలుసుకొనిన శివజాగ్రమునుజూచినాను. అనాదిగా సకల జగత్తు తానుగా నుండియు, యుండినామే యను వాసననువిడచి యుండిన సాక్షియే తానని తెలుసుకొనిన శివస్వప్నమునుజూచినాను. కనబడు జగమంతయు జ్ఞానరూపమని తెలిసి యజ్ఞానమునువిడచి మనోలయమయిన శివసుషుప్తిజూచినాను. ఈసుషుప్తిని దెలిసికొన్న జ్ఞానము సర్వసాక్షి తానుగాగని అనుభవించు శివతుర్యమునుజూచినాను. ఈతుర్యమే సచ్చిదానందములయమై పరమైన మహాకారణ శరీరమని యీ తుర్యములయమయినచోటు అతీతమయిన శుద్ధబ్రహ్మమని జూచి

నానని విన్నపము జేసిన శిష్యుని. యీయాచార్యు డాదరించి స్వ త్వా సకలవేదోపనిషదర్థములలో చెప్పఁబడు వస్తువున్ను మాయ నుభవమున్ను యిదియే గనుక యిందుకు సందేహా విపరీతము లాక దేహముపడుపర్యంతము యనుసంధానము జేసియంత్యములో విదేహకైవల్యమును బొందుదువుగాక యనికటాక్షించిరి.

—(*) ఉత్పత్తి ప్రకరణము సంపూర్ణం. (*)-



# IV స్థితి ప్రకరణము.

పూర్వము జెప్పిన మూడు ప్రకరణములవల్లను సమాధిలో సహజా త్మానందానుభవము కలిగి దేహాది ప్రపంచములు మొదలగునవి స్వప్నములో కనిన వస్తువులవలె స్వానుభూతిమాత్రము ప్రకాశించు శిష్యునికి సకల వ్యవహారములు సుషుప్తివలె అయి సత్తామాత్రమైన బ్రహ్మానందానుభవ సాక్షాత్కారముదయమగుటకుగాను స్థితిప్రకరణమును జెప్పుచున్నారు.

శ్లో॥ ఉక్త్వాజ్ఞస్తపసీ ప్రాప్య సత్యగుణాంత్సదా ।
ప్రపంచవ్యవహారాదీన్ కృత్వాత్రైశుద్ధమానసః ॥ ౧ ॥
నిర్ముక్తసర్వసత్కేచ్ఛిద్విహాయాశాదిపాశకాన్ ।
భాసంతే భాసురైః ప్రాజ్ఞ్యం గుణైశ్శిష్టో హి విష్టపే ॥ ౧ ॥
ద్వివిధా తే ప్రవర్తంతే । సమాధిప్రాప్తిముత్తమాః ।
ఉన్ముచ్య నామరూపాదీన్ । వ్యాపకాన్ భవబంధకాన్ ॥ ౧ ॥
సమాధావిస్థితేవన్యే । విరక్తాస్త్యక్తసంసృతిః ॥
ఆచరన్త్యంతిసమాధిం । నామరూపాదిసంయుతః ।
ఇతరైర్జ్ఞేయమన్యే । గృహాస్తేః ప్రవిరాజతే ॥ ౧ ॥

—(*) టీ కా వి వ ర ము. (*)—

ప్రశ్న. సవికల్పసమాధిలోనుంచి వచ్చి దానంద స్వానుభూతిమాత్రముగా రమించు జీవన్ముక్తులు సకల వ్యవహారముల జేయుదురా?

ఉత్త. చేయుదురు. అందుచేత హానిలేదు.

ప్రశ్న. అదియేలాగు?

ఉత్త. జీవన్ముక్తులు బంధమోక్షములకు హేతువుగా నుండు రజస్తమోగుణములను విడచి ముక్తికి హేతువైన సత్త్వగుణ మాత్రముగా నుండి వర్తమానకాలములో సంభవించు అనేక కార్యములు చేసినప్పటికిన్ని అందువల్ల ఏప్రకారము లోకులకున్ని వారల దహింపజాలదు.

ప్రశ్న. అదేలాగు?

ఉత్త. సూర్యాస్తమానమై యంధకారమైన రాత్రివచ్చినప్పుడు కలువలు యంతమాత్రము ముకుళించవు. తటిమ తామరలంతయు ముకుళించుకొనును. ఆప్రకారము తెలిసికొన్నవారు మాయాకార్యములైన నానారూప ప్రపంచ వ్యవహారములలో చేరియు చేరక లేక సుఖదుఃఖవిలక్షణులై యెచ్చోటనైన నిఖండవ్యాపక చిన్మాత్రముగాని ఢి హితమహితములో సమదృష్టి గలవారై యుందురు. అట్టివారే మంచిమార్గము ప్రవర్తించుదురని పెద్దలు చెప్పుదురు.

ప్రశ్న. అయితే వారొకరితో కూడరా?

ఉత్త. శాంతి, విచారము, సంతోషము, సాధుసంగమము, అను సత్పురుషులతోడనే గూడి వాటినే ఆభరణముగా ధరించియుందురు.

ప్రశ్న. వారు తనకు చిక్కని భోగములలో నిచ్ఛకొందురా?

ఉత్త. సముద్రమైనది నదకుండు గట్టును దాటక వేరొకటిని చేరకయుండునట్లనే జీవన్ముక్తులున్ను ప్రమసించు భోగములననుభవించుటతప్ప వేరుభోగముల నిచ్ఛయించరు.

ప్రశ్న. ఆదిత్యునివలె నిచ్ఛాయత్నము లేక వర్తమానకాలములో వచ్చు పనులనుగురించి పొందియు పొందని మనసుతోనుండి వచ్చుచునవే

యములో నాజీవన్ముక్తులుండు స్థితియేది ?

ఉత్త. విడువకుండుట, విడుచుట, విచారము, తేటగా తెలుసుకొనుట, నొచ్చుకొనుట, త్రిప్పుకొనుట, యోచించుట, తీర్చుట, చూచుట, నిశ్చయించుట, అయినస్థితితోనుందురు.

ప్రశ్న. విడువకుండుట అనగా యేది ?

ఉత్త. దుఃఖములేని సుఖనిల్కడలోనుండు పెద్దలయొక్క సత్సంగము.

ప్రశ్న. విడుచుట యనగా యేది ?

ఉత్త. రజస్తమోగుణముల గలిగిన దుష్టులయొక్క దుస్సంగము.

ప్రశ్న. విచారమన నేమి ?

ఉత్త. నేనెవడు, ప్రపంచమేది, యని విభజించి తెలుసుకొనుట.

ప్రశ్న. తేటగా తెలుసుకొనడమనగా నేమి ?

ఉత్త. గురు, శాస్త్రములు, బుద్ధి, వీట్లచేత తీర్మానించిన నిలకడ.

ప్రశ్న. నొచ్చుకొనుట యనగా నేమి ?

ఉత్త. తన్ను తెలుసుకొనుదారి విషయముగా నొచ్చుకొనుట.

ప్రశ్న. త్రిప్పుకొనుట యనగా నేమి ?

ఉత్త. సకలకర్మములలోను, నేను, నాది, యని యభిమానము జేయకుండుట.

ప్రశ్న. యోచించుట యనగా నేమి ?

ఉత్త. సర్వము తానని తలంచుట.

ప్రశ్న. తీర్చుట యనగా నేమి ?

ఉత్త. శరీరములో వచ్చు శోకతాపములు.

ప్రశ్న. చూచుటయన నేమి ?

ఉత్త. సర్వచరాచర ప్రపంచములోపల బైట నిండి వ్యాపించియుండు తన స్వరూపమునుజూచి నిలుచుటయే.

ప్రశ్న. నిశ్చయించుట యనగేమి?

ఉత్త. బ్రహ్మాది స్తంభ పర్యంతము నిండియుండేది చిత్తనియు, వాటినంతయు తనవ్యాపకమేనని నిశ్చయించుట. ఈలాటి కార్యములోని జీవన్ముక్తులయియుందురు.

ప్రశ్న. సత్వజన్మము యెందుచేతవచ్చును?

ఉత్త. ముందుజన్మములలో జేసిన తపఃఫలప్రయత్నములచేత వచ్చుచేగునేకాని వేరే కర్మములచేతరాదుగనుక సత్వగుణమే మోక్షమును నిచ్చును. మిగత రెండుగుణములు మాయాకార్యమైన జననమరణ సంసారదుఃఖములనిచ్చును.

ప్రశ్న. ఈసత్వగుణము నెవరు పొందియుందురు?

ఉత్త. ఇకజన్మముబొందక ముగింపైన జన్మముగలవారుకలిగియుందురు.

ప్రశ్న. రజస్తమోగుణము లెవరుకలిగియుందురు?

ఉత్త. మంటపమును స్థంభములు భరించుకొని యుండులాగున సకలజీవులా రెండుగుణములలో జిక్కి భరించుకొనియుందురు. గనుక సత్వగుణమునుబొంది రాజసతామసగుణములను విడిచినవారలు జననమరణ ప్రవాహములోనుండి దరిజేరినవారు.

ప్రశ్న. ఏలాగువిడచెదరు?

ఉత్త. సత్వగుణమును ధరించుకొని రాజసతామసములనందుచేత వచ్చు పాశబంధములను సర్పములు చర్మమువిడుచులాగు జారవిడుతురు.

ప్రశ్న. అది ఏలాగు?

ఉత్త. సర్వముతానుగా ప్రకాశించుటవలన తానువేరు ప్రపంచము వేరనిద్వివిధభావమువదలి బ్రహ్మమయమయినచిత్తునందుకలిగినవారు.

రూపకల్పనలు యావత్తు సముద్రజలమే అలలు మొదలయినవిగాకనబడు భంగిమిథ్యయేగాని, సత్యముకాదు. శోకమోహాములు పుట్టుటగిట్టుటయున్ను పుట్టిగిట్టితపించ బడువారున్ను లేరు, వచ్చినది, పోయినది, తలచునది యేమిలేదు. ఏకముగా ననేకముగా నెప్పటికిన్ని వుండునస్తువే యెచ్చోటను సర్వవ్యాపకముగా వ్యాపించి సత్తామాత్రముగా బ్రకాశించునని చంచలరహితమైన యూహాబుద్ధిచేత దెలిసి సకలదుఃఖములను విడుపించుకొని సత్వగుణముగా మిగిలియుందురు.

ప్రశ్న. ఇంక నేలాగుందురు?

ఉత్త. స్వరూపవ్యాపకములోనిల్చి పూర్ణచంద్రప్రకాశమువలె శాంతి పొందిమహానందముగా మణిప్రభవలె ప్రకాశించుచు, నిర్మలముగా వర్తమానకాలములోవచ్చు వ్యవహారములను సమదృష్టిగా జూచి తగిలితగలకయువిమనకొననేయిచ్ఛయు కాదని విసుకు విడచి వుదాసీనమాత్రముగా నుందురు.

ప్రశ్న. సత్వగుణములో మాత్రము జ్ఞానముసులభముగాగలుగుచున్నదని యనుట యెట్లు?

ఉత్త. ఉత్తమమైన వెనుమాపడినమంచుబిందువు ముత్యములయిన రీతిసత్వగుణములో జన్మించినవారే శ్రేష్ఠులు. మంచివారలు, స్నేహితులు, తెలిసినవారు, అనిత్యములను బోగొట్టుకొన్న నిత్యముక్తులు జ్ఞానులు అని విశిష్టనామములను బొందుదురు. వారలకే జ్ఞానము సులభముగావచ్చును.

ప్రశ్న. వారలు తగిలితగలక కార్యములుచేయుటయెట్లు?

ఉత్త. సూర్యుడచ్ఛలేక కిరణములచేత ప్రకాశించియుండగా అవన్నికావ

ఫలముచేత క్షణము, ఘడియ, ఝామును, దినము, నక్షత్రము, వారము, పక్షము, మాసము, ఋతువు, ఆయనము, సంవత్సరము, మొదలయినవి కనపడుచుండఁబున జీవన్ముక్తులు భూతకాలములోను భవిష్యత్కాలములోను, వస్తువులను జింతించక వర్తమానకాలములోవచ్చు కర్మలు మాత్రము తమస్వానుభవముగాజూచి వ్యవహరించుదురు.

ప్రశ్న. ఈప్రకారము విచారజ్ఞానఫలముచేత ద్వివిధబుద్ధివదలి యద్వైతానంద స్వరూపమాత్రమయిన జ్ఞానులను కామాదులు తగులుపడికష్టపెట్టవా?

ఉత్త. వజ్రకవచము ధరించినపురుషుని ఆయుధములు కష్టపెట్టనటువలె చిన్మాత్రముగా ప్రకాశించు జ్ఞానికి కామాదులు తగులుపడి కష్టపెట్టవనే సిద్ధాంతము.

ప్రశ్న. వజనాభి సదృశమయిన మోహము తీగెమొలచుటకు మూలముగాను శోకమనెడి సర్పముండి రాజ్యముచేయు చోటుగానుండు దేహమును నేననుసత్యబుద్ధి జేయించు నజ్ఞానమనెడు మూలము ఏకముగానునిత్యముగానుండుస్వరూపస్వభావముగలిగినతక్షణమే వేరుతో నాశనమౌనని చెప్పిన శృతియుక్తి ప్రమాణములుండగా జీవన్ముక్తులు నేనుపోయినాను, వచ్చినాను, నిద్రించినాను, మేలుకున్నానని చెప్పనచ్చునా?

ఉత్త. వారలేలాగు చెప్పినను గమల పత్రోదకమువలె దగిలి దగలకయుందురు. వారల చిత్తముపోయిన చోటెల్ల చిదానందముగా రమించియుండును. అందుచేత బాధలేదు. అట్లులేక నామరూపములలో జిత్తమైనది మొగిడిపడెనేని మనస్సు చెడదు. ఎం

ధములు చేరవు. గనుక నగపడు వస్తువు లేదని సర్వము చిత్తుగా కనినతుడల మనస్సు లేక పోవును. అదియే మోక్షము.

ప్రశ్న. అయితే ప్రపంచవ్యవహారములను జ్ఞాను లేలాగు కనియుందురు ?

ఉత్త. నేను లేదు, ఇదియను విషయము లేదు, యనిరూపము లేని శ్రయలువలె దాను బరిపూర్ణ స్వరూపమని దనస్వరూప వ్యాపకములో నగుపడిన నామరూపములు ప్రకాసించు చున్నదనిన్ని తనయొక్క సచ్చిదానంద స్వరూపముతప్ప నామరూపముల కాధారము లేదనిన్ని సచ్చిదానందమను మూడున్ను స్వరూపసంబంధమనిన్ని నామరూపములు రెండున్ను మాయాసంబంధమనిజూచి మాయాసంబంధమునువిడిచి సర్వము సత్తామాత్రమైన స్వరూపమేయని దృఢముగాజూచియుందురు. అలాటిపెద్దలు ఆశయనుబంధములన్నిటిని అసంకల్పమనెడు ఖడ్గముతో గోసివేసెను దేహభావమును నేనని చెప్పని బల్లెముతో గృచ్చి యున్ని నసించిన స్వరూప స్వభావమే తానని భావించిన భావనచేత జననమరణములేని ముక్తి స్వరూపమగుదురు.

ప్రశ్న. ఈజీవన్ముక్తులకు నేకదేశముగా నధిక సుఖము వచ్చినను, దుఃఖము వచ్చినను ఆసుఖములో రమించియు దుఃఖములో గష్టపడియుందురా ?

ఉత్త. ఉండ్లుంతేరు. సుఖము, భయము, కోపము, దుఃఖము, ఓర్వలేనితనము, మొదలయినవి వచ్చినను వీటికొకవస్తువుగా జూడక సత్తామాత్రముగాకని సుషుప్తివలె విశ్రాంతిబొంది స్వరూప భావనను విడువక యుందురు. ఇదియే శివజాగ్రము. ఈజాగ్రతలోనుండి యొక నిమిషమైనను వదలని వారలె జీవన్ముక్తులు.

ప్రశ్న. సకలవాసనలను సుషుప్తివలె అయి విశ్రాంతిగా తెలిసినపూర్వ, దృష్టికలిగిన జీవన్ముక్తత్వముపొందిన పెద్దలుమరల ఈజగములో జనించుదురా ?

ఉత్త. మాయా మయమయిన ఆశాపాశములనున్ను సకల వాసనలనున్ను విడచి అంతరమునందు చిన్మాత్రముగాను బయటసకల వ్యవహార క్రియలు చేసియుందురు. ఇదిగాక బాహ్యపనుల నాటకంభించి చేయువారివలె నటించియంతరమందే క కార్యమును జేయని వారలు గాన అహంకార రహితులు గానుందురు. ఇదియును గాక ఆకాశమువలె అరూపుగాను ఆవరణమును వదలి సకలనామరూపగుణతులు లేక నేకవిధములుగా జగమునందాడుదురు.

ప్రశ్న. ఈలాగు సత్వగుణముతో గూడి యుండియు జన్మము లేదనుట యేలాగు ?

ఉత్త. వేయించిన విత్తనములు తినుటకు వుపయోగ పడుటయేగాని మొలచుటకు గారణము కానటువలె సత్వగుణము శుద్ధవాసనకు గారణమైనసహాయమై జీవన్ముక్తులవద్దయుండుటవలనజన్మము లేదు.

ప్రశ్న. శుద్ధవాసనయన నేమి ?

ఉత్త. సత్యమునువిడువక నొకటైన యాత్మధ్యాన మాత్రముగాను నిర్వికల్పముగానుండుటయే శుద్ధవాసన. ఇదిసుఖముగా నుండుట వలన యిందులో సదాకాలము సుషుప్తివలె లయపడి యుండువారలే సహజసమాధిని బొందియుండువారలు.

ప్రశ్న. స్వరూపసమాధిని బొందినవారు లెన్నివిధములుగానుందురు ?

ఉత్త. రెండువిధములుగా నుందురు.

ప్రశ్న. అది యేలాగు ?

ఉత్త. నానావిధ వ్యవహార కార్యములతో గూడ చేరి సమాధి జేయుచా రును, వాటిలో ఫలములేదని సన్యాసియై యేకాంతముగా ప్రత్యేకమైన చోటనుండి సమాధి జేయువారలుగానుందురు. అలాగైనను వారలిద్దరికి మోక్షఫలము సరి కేయగును.

ప్రశ్న. అది యెటువలెను?

ఉత్త. ఇద్దరి హృదయములు శీతలమాత్రముగానుండును. ఆ శీతలమే వారలనంత జన్మములో జేసియుండిన తపఃఫలమని జెప్పుదురు. ఆయనుభవములో నెల్లప్పుడు సుఖించియుండువారి యొక్క మనస్సు ఏకదేశకార్యములో బ్రవేశించి చలనమైనందుచేత వచ్చు వ్యాకులమువల్ల వారికి నొకహానివృత్తియులేదు; వారు సమదృష్టిగానుండి ఉన్మత్తునిచందంబున వేషకులు నభినయించువలె నొకకష్టము లేక సుఖసమాధిలోనుందురు. గనుక తెలుసుకొన్నవారు వ్యవహారముల జేసినను దానిని విడిపించుకొని సదానిష్ఠలుగా స్వరూపసమాధిలోనుండినను, యిద్దరికి మోక్షఫలము సమముగానుండును, తప్ప హెచ్చు తక్కువలులేవని శృతిస్మృతులలో జెప్పబడియున్నది.

ప్రశ్న. వ్యవహారమువదలి సదానిష్ఠలుగానుండు వారెచ్చటవసియింతురు?

ఉత్త. అలాటి పరమయోగులు నిద్రించినను, మేలుకున్నను, వ్యవహారముల జేసినను, చేయకయుండినను సదాంతర్ముఖదృష్టియౌనుటవలన యిల్లు, పట్టణము, అడవి, యివియంతయు సమముగానెంచియుందురు. వారల మనస్సుయపుడున్ను విశ్రాంతి బొందియుండుటవలన శీతలముగా జేయుచుండును. అందుచేత గనపడు జగత్తు కూడ అతిశీతలముగానే ప్రకాశించును. ఈలాటి అంతర్ముఖ

నిష్ఠలేనివారలు వనములందు, గుహాలలో, నాసనములుగట్టికొని యుండినను మనస్సు బహిర్ముఖము బొందియుండుటచేత నావనములు, గుహాములంతియు, యిల్లు పట్టణములుగానే యగపడుచుండును. గనుక నొకకార్యము జేసినను కార్యములను విడచినను, సుఖసమాధిలోనుండినను, అంతర్ముఖనిష్ఠకలిగిన జ్ఞానుల మనస్సువిశ్రాంతిబొంది యతిశీతలముగా స్వరూప సమాధిలో దానే సుఖించియుండువారలకు శ్రుతియందిచ్ఛ లేదని శ్రుతిస్మృతులలో జెప్పబడుచుండుట సిద్ధాంతము.

—(*) స్థితిప్రకరణము సంపూర్ణము. (*)—

—:0:—



# V ఉపశాంతిప్రకరణము.

పూర్వమును చెప్పిన నాలుగు ప్రకరణములవల్లను స్వరూప సమాధిని బొంది నిష్ఠాపరుడైన శిష్యునికి మనస్సుపోయిన స్థలమంతయు చిదానంద ముగాభరమించి సహజానంధానుభవము సుఖముగునట్లు నిమిత్తముపశాంతి ప్రకరణమును జెప్పుచున్నాను.

శ్లో॥ జననందుర్లభంలోకే । నరమోనాకదాచన ।
జాతోపివేదశాస్త్రాణాం । వివేకోహిసుదుర్లభః ॥ ౧ ॥
జ్ఞాత్వాతథాపివేదాంతే । జ్ఞానసిద్ధిరసుదుర్గమః ।
సంప్రాప్తాబ్రహ్మవిద్యాయాం । ధ్వంసోజ్ఞానస్యదుస్తరః ॥ ౨ ॥
విపరీతసందేహాదీన్ । విచారేణహృతోపిచ ।
నభవేదజ్ఞానధ్వంసస్త్వపరోక్షేసుఖప్రదే ॥ ౧ ॥
అజ్ఞానంతావృశంశాస్త్రా । త్సద్గురోశ్చననశ్యతి ।
ఆత్మద్రోహిసతుద్వంద్వో । వేదేనిగదితోబుధైః ॥

—(౦) వీటికి వివరణము. (౦)—

ప్రశ్న. సకల సందేహ విపరీతములు విడుపబడి ప్రపంచ వ్యవహారములు మొదలగునవి సుషుప్తివలె సదానిష్ఠులుగా విశ్రాంతిబొందియుండి యు వివేకుల మనస్సులో నొకవేళ యేకదేశముగా కర్మవశము చేత సమదృష్టివదలి యజ్ఞానమైన అసంభావన కనబడెనేని వార లకు మోక్షము లేదా?

ఉత్త. అటువంటి పెద్దలమనస్సులోన సంభావనలు రావు. వార

లకు గర్మలు లేవు. అట్లులేక ఒకవేళ యేకదేశముగా గలిగినేని వారలకు మోక్షము లేదు.

ప్రశ్న. అది యేలాగు?

ఉత్త. ఈప్రపంచములో నుద్భవించు కాలమందు మనుష్యజన్మము పుట్టుటయఱుదు. పుట్టినేని వేదాధ్యాయనమునకు గావలసిన బ్రహ్మకులములో పుట్టుట యఱుదు. అట్లుపుట్టినేని మూగిగాను, చెవ్రుడుగాను, గుడ్డివాడుగాను లేక పుట్టుటయఱుదు. పుట్టినేని నపుంసకుడు లేక పుట్టుటయఱుదు. అలాగు పుట్టినేని విద్యాభ్యాసము చేయుటయఱుదు. అట్లువిద్యాభ్యాసముచేసినేని వేదాధ్యాయనము చేయుటదుర్లభము. అట్లుచేసినేని వాటిలోనిర్ణీతమైన కర్మలజేయుట యఱుదు.

ప్రశ్న. ఆకర్మలేవి?

ఉత్త. నిత్య, నైమిత్య, కామ్య, నిషేధ, ప్రాయశ్చిత్తములనంబడు నైదువిధములు గలవు.

ప్రశ్న. నిత్యకర్మయనసేమి?

ఉత్త. స్నాన, పాన, సంధ్యావందన, జప, హోమ, దేవతర్పణ, వైశ్వదేవ, పశువందన మొదలయినవి.

ప్రశ్న. నైమిత్య కర్మయనసేమి?

ఉత్త. సంక్రాంతి, పర్వం, అర్ధోదయం, మహోదయము, మొదలుగా గల పుణ్యదినములలో స్నానము చేయడము మొదలగునవి.

ప్రశ్న. కామ్యకర్మయనసేమి?

ఉత్త. అశ్వమేధ, రాజసూయ, పౌండరీక, మొదలగు యాగములు చేయుట; సోమవారవ్రతములు మొదలయినవి చేయుటయే.

ప్రశ్న. నిషేధకర్మయనగేమి?

ఉత్త. పరస్త్రీగమనము, దొంగతనము, చంపుట, మధుపానము, అబద్ధము, వీనిని చేయక నియమముగానుండుటయే.

ప్రశ్న. ప్రాయశ్చిత్త కర్మయనగేమి?

ఉత్త. చాంద్రాయణాదులు, పర్వతమందు సంచరించుట, జలభక్షణము, వాయుభక్షణము, తీర్థయాత్ర, మొదలగు కర్మలు జేయుటయే.

ప్రశ్న. ఈకర్మములచేత ఫలము లేవి?

ఉత్త. దేహముండుపర్యంతము నిత్యనైమిత్యకర్మముల జేయుచు వచ్చిన ప్రారబ్ధముబోవును. కామ్యకర్మచేయుచువచ్చిన స్వర్గభోగములు కలుగును. నిషేధప్రాయశ్చిత్త కర్మముల జేయుచు వచ్చిన సంచితము దొలగిపోవును. అందుచేత ముక్తికలుగునని కొందరు జెప్పుచున్నారు. అయితే అది ముక్తికాదు.

ప్రశ్న. అది యెట్లు?

ఉత్త. కామ్యకర్మములచేత జ్ఞానము రాచాలదు. స్వర్గఫలముమాత్రమువచ్చును, దానిని బొందెనేని మరల జననమరణమే వచ్చును తప్ప ముక్తిరాచాలదు. నిషేధకర్మము, ప్రాయశ్చిత్త కర్మము, పురుషునికి కర్మములో నధికారముగలుగ జేసి ప్రత్యవాయమును బోగొట్టును. ఈప్రకారము త్రివిధకర్మములు జ్ఞానసాధనములుకావు. పైచెప్పబడిన నిత్యనైమిత్యమను రెండుకర్మములు మూడువిధములుగానున్నవి.

ప్రశ్న. అది యేలాగు?

ఉత్త. సత్వకర్మము, రాజసకర్మము, తామసకర్మము, అని మూడువిధములు. వాటిలో రాజసతామసమైన రెండుకర్మములు జనన

మరణాదుఃఖమును వృద్ధిజేయును, దానివలన జ్ఞానము గాచాలదు. సత్కర్మముమాత్రము చిత్తశుద్ధికలుగజేయుటవల్ల జ్ఞానసాధనే మౌను. ఈప్రకారము కర్మముచేతనేకదేశముగా గలుగు చిత్తశుద్ధినిగురించి కొందఱు జ్ఞానపటంకరమని చెప్పుచున్నారు. అయితే ఆసత్కర్మము చేయునప్పుడీశ్వరార్పణముగా జేయువలయునని పెద్దల వాక్యముండుటవలన నిష్కామ్యముగాజేయు సత్కర్మము చిత్తశుద్ధికిగారణమేగాని మోక్షమునకు గారణముకాదు యని చెప్పుటవల్ల నిష్కామ్యకర్మముచేత చిత్తశుద్ధిగలిగి దానిచేత సద్గురులాభముకలిగి దానివలన శ్రవణాదులుకలిగి అందువలన జ్ఞానముకలుగునని చెప్పబడియున్నది.

ప్రశ్న. ఈశ్వరార్పణము చేయుటలో చిత్తశుద్ధివచ్చేని జ్ఞానము దేనిచేతవచ్చును?

ఉత్త. సద్గురువల్లను, శాస్త్రములవల్లను రావలసినది. దీనికి ప్రమాణము.

మ॥ తనుఁదాఁ గానమిఁగాలఁ మిడిదిగ్ద్రాంతో సుగానస్తమం ।
దునజ్రసంబుఁజరించుసుఖదనస్తోక్రియస్థాత్రిని ।
ల్వనివాసంబిసుమంత లేకజనస్రవాతంబుల జిక్కుఁగాపున
స్వాత్మానుభవంబుదాఁకె సుకనీప్రాహింపమీయుర్థముఁ ॥

తా॥ ఓయిశిష్యుఁడా జీవసాక్షియైన కూటస్థుఁడను తాను, ఈశ్వరసాక్షియైన పరబ్రహ్మను తన్నుగా తెలియనివాఁడు స్థూలసూక్ష్మకారణము దేహభ్రమలలోఁదగిలి నేను నేపుణ్యపాప ప్రారబ్ధాని సంచితములనే దను సుఖి దుఃఖి అనునవి మొదలగు పొ యుక్తములైన దుర్బుద్ధులనుపొంది పోయిలేక యుగ, సంవత్సర, మాసాది, కల్పితభేదములుగల కాలమునను

చక్రమందు చిక్కుపడి దిక్కుగానక సుడిగాలిలోబడి వడికి గిరగిరతిరిగెడు చత్తవలె నానావిధజంతువుల గర్భములో బుట్టుచు పుణ్యపాప మిశ్రకర్మ ఫలములగు సుఖదుఃఖముల ననుభవించిగిట్టుచు ఈవిధమున అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమగు పరబ్రహ్మమే నేననునట్టి తెలివిపుట్టువరకు నుండును. కా బట్టి నీవిట్టును మనస్సున బెట్టి నేనను ఆత్మజ్ఞానము లేనందున ఈ తీరున పుట్టుచుగిట్టుచునుంటివని తెలుసుకొని నిన్ను నీవెఱుగునట్టి నిష్ఠయందు ప ట్టుదలగలిగియుండుమని తాత్పర్యము.

శా॥ త్వానైకన్గొనఁదన్నుఁజూఁదనవునాథా రేశునాయీశుఁడే ।
హానోపాధులువీడి వెన్కఁదగనూహింపంబరబ్రహ్మమా ।
నేనేజ్ఞానమునీవునన్నడుగనీకిచ్ఛం దెల్పితిర్ దీనన ।
న్మానింపక నినునంట వేవ్యథలు స్వాత్మబ్రహ్మభాసిల్లఁగన్ ॥

తా॥ ఓయి శిష్యుడా. "కార్యోపాధిరయంజీవః కారణోపాధిరీశ్వరః" అనెడు స్మృతినిబట్టి కార్యోపాధియైన జ్ఞానమును అంతఃకరణమును దా నికి అధిష్టానమైన బ్రహ్మాభిన్నకూటస్థ చైతన్యమును, ప్రతిబింబ చైతన్య మును, శరీరత్రయమును వీనియందలి యధ్యాసమునుగూడి జీవుఁడనఁబడు ను. కారణోపాధియైన మాయయును, అంతఃకరణము దానికి నధిష్టా నమైన బ్రహ్మచైతన్యమును, ప్రతిబింబచైతన్యమును, శరీరత్రయమును వీని యందలి యధ్యాసమునుగూడి యీశ్వరుఁడనఁబడును. పైఁజెప్పబడిన లక్షణములుగల జీవుఁడైన తాను గురూపదేశమువలన తన్నును తనకు ఆధారమైన యీశ్వరుని విచారించి కించిజ్జ్ఞత్వాదిగుణములుగల జీవత్వ మును జహల్లక్షణముచేత విడిచి అజహల్లక్షణముచేత సర్వజ్ఞత్వాదిగుణము లుగల యీశ్వరత్వమునుబొంది విస్పష్ట జీవేశ్వరోపాధి కారణములగు మూలతూల అనుపేర్లుగల అవిద్యను మాయనువాని కార్యములయిన

ప్రతీధాత్ములుకు సర్వజ్ఞత్వాదిగుణములునుగల యీశ్వరత్వమును జహల్లక్షణముచేతవదలి అజహల్లక్షణముచేత దానికి న్నాధారభూతుడును సచ్చిదానందాదిగుణములుగలవాడును అయినపరబ్రహ్మము తానగునుగనుక నీవును నామాటలయందు నమ్మకముగలిగి బ్రహ్మనిష్టగలవాడవై తివేని నీయంతఃకరణమందు అపరోక్షజ్ఞాన మున్ప్రకాశించి సర్వదుఃఖములుతీరి ముక్తుడవగుదువని తాత్పర్యము.

అని చెప్పియుండుటచేత విచారజ్ఞానముకలుగు నిమిత్తము సకల కర్మలనీశ్వరార్పణముగా జేయువలయును. ఆఫలముచేత శివుడే దయకలిగి జీవకారుణ్యము, ఈశ్వరభక్తి, పరవైరాగ్యము, బ్రహ్మజ్ఞానము, అనునాలుగు నొక దివ్యమైన శరీరముగా నవతరించిన సద్గురులాభము కలుగును. అందుచేత శ్రవణముగలుగును. దానివలన మననముకలుగును. అందువలన నిధిధ్యాసముగలుగును. దానివలన వివేకజ్ఞానము కలుగును. అందువలన తన్నును యజమానుని భావించి తెలుసుకొనవచ్చును. కైవల్యము మొదలగుశ్రుతులయందు చెప్పబడియున్నది.

ప్రశ్న. తన్ను తెలుసుకొనువిధమేలాగు?

ఉత్తరం ప్రపంచములో శబ్దాదివిషయములుగా గనబడు ఇంద్రియజ్ఞానమంతయు జీవుడే యనుభవించునని అజ్ఞానముచేత జెప్పినయడల ఈ ఇంద్రియములవల్ల గనబడు నామరూపము లంతయు యింద్రియములకు గనబడునేగాని చిదాభాసుడైన జీవునికి లేదని యనుభవము గలుగును. యేలాగనిన మంచిచెడ్డ శబ్దములను దెలిసి కనుగొనుటకు శ్రోత్రేంద్రియమేగాని జీవుడు దెలసికొనజాలడు.

ప్రశ్న. అది యేలాగు?

ఉత్త. చెవిటివాండ్లకు జీవుడుయుండుటవలన ఆజీవుడు శబ్దమును ఎరుగవలయును. అట్లులేమిచేత శబ్దమును దెలుసుకొనుట శ్రోత్రేంద్రియమే, దానిని జీవుడు దెలుసుకొననందున దనమీద నారోపణ చేసుకొని నేనేశబ్దమునుగ్రహించేవాడనని చెప్పడమేగాక జీవునికి నీభిన్నజ్ఞానము గాలత్రయములోలేదు. త్వగింద్రియ బుద్ధియైన స్పర్శము జీవుడు దెలుసుకొనిన యడల తిమిరవాయువు కొన్నవారలయందును జీవుడుయుండుటవలన నాజీవుడు సీతోష్ణస్పర్శమును గనుగొనవలెను. అట్లులేమిచేత స్పర్శమును గనుగొనుజ్ఞానము త్వగింద్రియమే, దానిని జీవుడు దెలుసుకొనక తనమీద నారోపణము జేసుకొని నేనేస్పర్శమును దెలుసుకొనువాడనని జెప్పుటయేకాక జీవునికి భిన్నజ్ఞానముగాలత్రయములోలేదు. నేత్రేంద్రియజ్ఞానమైన రూపము జీవుడు కనుగొనిన యడల గ్రుడ్డివాండ్లకు జీవుడుయుండుటచేత ఆజీవుడు పంచవర్ణములను దెలుసు కొనవలయును. అట్లులేమిచేత రూపమును దెలుసుకొను జ్ఞానమునేత్రేంద్రియమే, దానిని జీవుడు దెలుసుకొనక తనమీద నారోపణము జేసుకొని నేనేరూపముగనుగొనువాడనని జెప్పుటయేగాక జీవునికి భిన్నజ్ఞానము గాలత్రయములోలేదు. జిహ్వేంద్రియజ్ఞానమైన రసము జీవుడేకనుగొనిన యడల దోషముపొందినవారలలోగూడ జీవుడు షడ్రుచులను విభజించి తెలుసుకొనవలయును. అట్లులేమిచేత షడ్రుచులను దెలుసుకొనుజ్ఞానము జిహ్వేంద్రియమే, దానిని జీవుడు దెలుసుకొనక తనమీద ఆరోపణము జేసుకొని నేనేరుచులను గనుగొనువాడనని జెప్పుటయేగాక జీవునికి భిన్నజ్ఞానము గాలత్రయములోలేదు. ఘ్రాణేంద్రియబుద్ధియైన గంధము జీవుడే

కనుగొనినయడల ముక్కు లేనివారికి గూడజీవుడుండుటచేత నాజ
వుడు మంచిచెడ్డ గంధమునువిభజించి తెలుసుకొనవలెను. అట్లు
లేమిచేత గంధమును విభజించి తెలుసుకొను జ్ఞానము ఘ్రాణేంద్రి
యమే, దానిని జీవుడు తెలుసుకొనక తనమీద నారోపణచేసు
కొని నేనే వాసనను గనుగొనువాడనని చెప్పుటయేగాక జీవునికి
భిన్నజ్ఞానము గాలత్రయములో లేదు. ఇట్లుండ ఈ ఇంద్రియ
జ్ఞానములంతయు తనవద్ద నారోపించుకొన్న యావరణము బూర్తి
యు జ్ఞానదృష్టిచేత విడువబడి ఈయింద్రియములద్వారా సంపా
దించబడ్డ పుణ్యాపాపములు తనకు లేదని కని నిరింద్రియుడై, నిర్దే
హుడై వుండు కూటస్థస్వరూపమే తానని విచారించి తెలుసుకొన
వలయును. ఇట్లువచనాది విషయములుగా గనబడు కర్మేంద్రి
యజ్ఞానములంతయు జీవుడుతనమీద నారోపణచేసుకొన్నదియే
గాక జీవునికి లేదు.

ప్రశ్న. అది యేలాగు?

ఉత్త. మూగివాండ్లకు జీవుడుయుండుటచేత ఆజీవుడు వచించవలయును.
అట్లు అగుపడనందున వచించునది వాగింద్రియమే. చేతులులేని
మొండివానికికూడా జీవుడువుండుటచేత ఆజీవుడు దానపరిగ్రహ్యా
ముల జేయవలయును. అట్లులేమిచేత దానపరిగ్రాహ్యాముల జేయు
ట పాణేంద్రియమే. కాళ్లులేని మొండివానికికూడ జీవుడు యుం
డుటచేత నాజీవుడు నడువవలెను. అట్లులేమిచేత నడుచుట పా
దేంద్రియమే. లింగలేపనము లేనివారికిగూడ జీవుడుండుటచేత

నాజీవుడుభోగించవలయును. అట్లులేమిచేత భోగించునది ఉప
స్థేంద్రియమే. బలముతగ్గి గుదము ముడుచుకొనియుండు వానికి
జీవుడుయుండుటచేత ఆజీవుడు మలవిసర్జనము చేయవలయును.
అట్లులేమిచేత మలవిసర్జనముచేయునది పాయువింద్రియమే. ఈ
లాగుండగానీకర్మేంద్రియబద్ధులంతయు తనదిగా జూచిన ఆవరణము
విడువబడి వాటిచేత నార్జింపబడిన పుణ్యపాపములంతయు తనకు
లేదని జ్ఞానదృష్టిచేతగని అసంగుడైన కూటస్థస్వరూపమే తానని
విచారించి తెలుసుకొనవలయును. ఈలాగే పంచకోశములను
జీవుడుదానని యారోపణముగానవలోకించినదేతప్ప జీవునికిలేదు.

ప్రశ్న. అది యేలాగు?

ఉత్త. పుష్టియగుట, శుష్కించుట, యనునది ఆహారత్వములైన అన్నమ
యకోశతాదాత్మ్యముతప్ప జీవునికిలేదు. ఉశ్వాసించినాను, ని
శ్వాసించినాననునది ప్రాణమయ కోశతాదాత్మ్యముతప్ప జీవునికి
లేదు. సంకల్పించుట, వికల్పించుట అనునది మనోమయ కోశ
తాదాత్మ్యముతప్ప జీవునికిలేదు. నేనేకర్తను, భోక్తను యనునది
విజ్ఞానమయకోశతాదాత్మ్యముతప్ప జీవునికిలేదు. నేను జ్ఞానిని,
మూఢుడను అనుట ఆనందమయకోశతాదాత్మ్యముతప్ప జీవునికి
లేదు.

ప్రశ్న. అది యేలాగు?

ఉత్త. నాశరీరమనునపుడు తాను వేరు, శరీరము వేరనియు, నాయింద్రియ
ము అనునప్పుడు తానువేరు, యింద్రియములు వేరనియు, నాప్రా

ణము అనునప్పుడు తాను వేరు, ప్రాణము వేరనియు, నామనస్సు అనునప్పుడు తాను వేరు, మనస్సు వేరనియు, నాబుద్ధియనునప్పుడు తాను వేరు, బుద్ధి వేరనియు, నాచిత్తమనునప్పుడు తాను వేరు, చిత్తము వేరనియు, నాఅహంకారమనునప్పుడు తాను వేరు, అహంకారము వేరనియు, నాఅజ్ఞానమనునప్పుడు తాను వేరు, అజ్ఞానము వేరనియు, నన్ను అనుభవముచేత తనకు అన్యముగాకని సాక్షియైన తనవద్ద ఆరోపణముగా వ్యవహారదశలో మాత్రమున్నదని విచారించి తెలుసుకొనవలయును.

ప్రశ్న. అలాగు తెలుసుకొన్నవారికి ఆరోపణము లేదా?

ఉత్త. ఈప్రకారము సాక్షిమాత్రముగా నుండువారికి శబ్దమును దెలుసుకొను శ్రోత్రమును, స్పర్శమును, దెలుసుకొను త్వక్కును, రూపమును దెలుసుకొను చక్షువును, రసమును దెలుసుకొను జిహ్వయు, గంధమును దెలుసుకొను ఘ్రాణమును, వచించునట్టి వాక్కును దానాది గ్రహణములు చేయు పాణియు, గమనము చేయు పాదమును, ఆనందించు ఉపస్థయు, మలవిసర్జనము చేయు గుదమును, ఉచ్ఛ్వాసనిశ్వాసములను జేయు ప్రాణాది వాయువులున్ను, సంకల్ప వికల్పములు జేయు మనస్సున్ను, నిశ్చయించు బుద్ధియు, అజ్ఞానమైన యవిద్యయు, భిన్నములేక అభిన్నమైన జ్ఞానస్వరూపముగా జూడబడి యుండుటవలన విచారించి తెలుసుకొన్నవారికి ఆరోపణము లేదు. ఇట్లు వక వికారములేని నిర్వికారముగా నుండగా నవాంతరకల్పితమైన మనస్సునకు కలిగిన అజ్ఞానముచేత జన్మమరణములు గలిగినట్లు కనబడినవి.

ప్రశ్న. ఆలాగైతే జననమరణ నరకస్వర్గములనుభవించు వారెవరు?

ఉత్త. కర్మకాండములో విధించబడిన పుణ్యకర్మములును దేహేంద్రియములచేత జేయబడిదానికి తగినదేవభోగములును దేహేంద్రియాదులే యనుభవించినది నిషిద్ధముగా జెప్పబడ్డ పాపకర్మములు దేహేంద్రియములచేత జేయబడిదానికి తగిన తిర్యగాదిస్థావర శరీరములెత్తి దుఃఖరూపములయిన నరకములను దేహేంద్రియాదులే యనుభవించినవి. ఈదేహేంద్రియాదులేతానని నిశ్చేతనార్జించబడు పుణ్యపాపకర్మములను దనదని అధ్యాసముగా గ్రహించిన యభిమానదోషముచేత లెక్కలేని జననమరణములు గలిగినవి. దీర్ఘముగా విచారించి తెలుసుకొనిన యడల సకలమున్ను ఈదేహేంద్రియములకేతప్ప యేకముగా నిత్యముగానుండేటి తానైన కూటస్థునికిలేదని దెలుసుకొనుటయే వేదాంత సిద్ధాంతము. ఇందుకు దృష్టాంతము.

## తిరుమంత్రము.

శ్లో॥ జీవశ్శివోనభేదోస్తినజానాతిశివంపరం ।
శివంజ్ఞాత్వాతతోజీవశ్శివఏవనసంశయః ॥

ఇదియునుగాక జ్ఞానేంద్రియములు అయిదు, కర్మేంద్రియములు అయిదు, అంతఃకరణములు నాలుగు ఈ పదునాలుగు యింద్రియములకు నొక్కొక్క యింద్రియమునకు త్రిపుటిగలవు. త్రిపుటి అనగా అధ్యాత్మికము, అధిదైవికము, అధిభౌతికము. వక యింద్రియమునకుగల త్రిపుటిలలో యేదైనా వకటి లేనియడల ఆయింద్రియము యొక్క వ్యవహారములు నడవవు.

| | అధ్యాత్మికము. | అధిదైవికము. | అధిభౌతికము. |
|---|---|---|---|
| | యింద్రియము. | దేవత. | విషయము. |
| 1 | శ్రోత్రము ... | దిక్కు. | శబ్దము. |
| 2 | త్వక్కు ... | వాయువు ... | స్పర్శము. |
| 3 | చక్షువు ... | సూర్యుడు ... | రూపము. |
| 4 | జిహ్వ ... | వరుణుడు ... | రసము. |
| 5 | ఘ్రాణము ... | అశ్వినికుమారులు... | గంధము. |
| 6 | వాక్కు ... | అగ్ని ... | వచనము. |
| 7 | పాణి ... | యింద్రుడు ... | ఇచ్చుట, తీయుట. |
| 8 | పాదము ... | వామనుడు ... | గమనము. |
| 9 | ఉపస్థ ... | ప్రజాపతి ... | రతిభోగము. |
| 10 | గుదము ... | యముడు ... | మలవిసర్జనము. |
| 11 | మనస్సు ... | చంద్రుడు ... | సంకల్పవికల్పము. |
| 12 | బుద్ధి ... | బ్రహ్మ ... | నిశ్చయము. |
| 13 | చిత్తము ... | వాసుదేవుడు ... | చింతించుట. |
| 14 | అహంకారము ... | రుద్రుడు ... | అహంభావము. |

ప్రశ్న. ఇంకయు నేలాగు ?

ఉత్త. సచ్చిదానంద స్వరూపముగాను, అఖండముగాను, అపరిచ్ఛిన్నత్వముగాను, సర్వవ్యాపకముగాను, కాలపరిచ్ఛేద, దేశపరిచ్ఛేద, వస్తుపరిచ్ఛేద, రహితముగాను, నిరామయముగా నుండుటయే ఆత్మస్వరూపమని శృతిస్మృతుల యందున్ను ఉపనిషత్తు మహావాక్యములయందున్ను గురువాక్యముకూడా చెప్పబడుచున్నది.

ఉ॥ ధ్వాంతసుషుప్తులందుశుచిధామము లేనితఱిన్స్వపస్థితిన్ ।
స్వాంతముగాకవస్తువులసంతమసంబునెఱుంగుచున్నతా ।
డెంతయుచిత్స్వరూపమగునిచ్ఛకుమీరినతానదానరై ।
సంతసమంది యేమఱకస్వానుభవంబుననున్నతోషమౌ ॥౨॥

—(*) వీటికి తాత్పర్యము. (*)—

పుట్టడాముందుజన్మములయందు నార్జింపబడిన పుణ్యపాపమిశ్రము లనెడు త్రివిధకర్మములచేతను, స్వర్గ మర్త్య, నరకములనెడు మూడు లోకములయందలి త్రికాలమునకు తగినసడవళ్లుగల మూఁడు శరీరములను బొందుచును, విడుచుచును, యీదేహి యెల్లప్పుడునుండు గనుక యితడే సద్రూపమగును. బ్రహ్మవిచారమందలి యాలోచనతోఁగూడిన దెలివివలన గలిగిననీయనుభవమందు షడ్వికార శూన్యత్వముచేత వికసన మొందుచునుండెడి సద్రూపమును నీవెఱుఁగుమని తాత్పర్యము.

కటికచీకటిలో నిద్రించుకాలమందును, దీపము లేనికాలమందును గా స్వప్నమనుబొందక, యింటిలోఁగలిగిన వస్తువులను చీకటిని యీరెంటిని తెలుసుకొనిన పురుషుడు చిద్రూపుడగును. కోరికను అతిశయించు తాను, తానై సంతోషమునుపొంది దానిని విడువక తనయనుభవమందు తానుండిన సంతోషమే యానందమగునని తాత్పర్యము.

మ॥ అవినాభావముతోనుసన్మతులుమిథ్యాభూతముల్గావవే ।
అవిద్యైనస్వరుడౌండుదోచుస్థితియెల్లబ్రజ్ఞకుర్ ।
దానిహేతువనంబీతికిజాడ్యమానెటులటలోషాద్వియాబవ్వనా ।
కవయొండైన బ్రహ్మోత్సవమందె యుగుదుఃఖంబుల్మతిర్ణాఅగర్ ॥౩॥

తా॥ త్రిపరిచ్ఛేదశూన్యమైన సద్రూపము త్రికాలాబాధ్యమైన చిద్రూపమును వకటేయగును. ఆనత్తుచిత్తులు రెండును నొకటియను అన్య

ముంలోను. అప్పుడుసర్వప్రపంచమునకు విలక్షణుడైన సాక్షియెక్కడ దో చును. (అనగా సత్తుకుచిత్తుకైన యడల సాక్షిదోచదనియు, చిత్తుకు సత్తువేఱయిన యడల నిల్కడ యెట్టిధమునను కలుగదనియు భావము). అచిత్తును ఆనందమునకు హేతువనినను అది జడస్వభావముగలదియగునే, అప్పుడు ఆనందానుభవము యేప్రకారమగును, కాబట్టి అసత్తు చిత్తుల యొక్క జంట యేకమైన పక్షమందు, దానియందే అంతఃకరణమంతు దోచెడు దుఃఖములునసించి నిరతిశయానందమగునని తాత్పర్యము.

మ॥ తనచేనన్యులచేవెలుంగునొకనత్సద్వస్తువాభాషజె ।
ప్పనసర్వంబెనవాచ్యమన్నసుతతాద్భావంబులేదన్న జే ।
యునెవంత్యానతుడెవ్విడైసనవితాయోచింపలేవన్నదీ ।
అనినానాదురవస్థలొందవెకుతర్కంబీవుజాలింపుమా ॥ ౮ ॥

తాత్పర్యము ॥ కుమారా, ప్రకాశమానమయిన దేశకాలవస్తు పరిచ్ఛేద శూన్యమయిన పరబ్రహ్మము, తనచేత ప్రకాసించునా లేక అన్యులచే ప్రకాసించునాయనెడి మాటలను జెప్పుటకు తగనిది. అట్లుజె ప్పగూడదనినను, ఆతాత్పర్యము లేదనినను, గొడ్రాలికొడుకు యేకార్యము లైనా చేసునే ఆపనులుయోచించి లేవనువానికి తొడబాయని బహువి ధములైన దుర్దశలంపొందవా, నీవుకుయుక్తులువిడువుమని తాత్పర్యము. ఈలాగునకైవల్యములో చెప్పబడుచున్నది. ఒకగృహము ఒకశరీరమును గురించి అందులోనుండువానివలె ఖండముగాను పరిచ్ఛిన్నముగా నొకదే హవ్యాపకమాత్రముగానుండుటవలన, యిక అఖండముగాను అపరిచ్ఛన్న ముగాను సర్వమునకులోపల వెలుపలవ్యాపించియుండు సర్వవ్యాపకము గానుండు యజమానుడైన బ్రహ్మస్వరూపము స్త్రీప్రకారమే విచారించి తెలుసుకొనవలయును.

ప్రశ్న. అది యేలాగు?

ఉత్త. అఖండపరిపూర్ణ వ్యాపకముగాను, అపరిచ్ఛిన్నముగాను, కాలదేశవస్తు పరిచ్ఛేదరహితముగా నుండుటయే బ్రహ్మస్వరూపమని శృతిస్మృతులలో జెప్పబడుచున్నది.

ప్రశ్న. ఆకాశమునకు నీగుణములుండుటచేత దానినే బ్రహ్మమని చెప్పవచ్చునా?

ఉత్త. ఆకాశమైనది నాల్గుభూతములలోను నిండి సర్వవ్యాపకముగా నిరవయవముగానుండినను సృష్టికాలమందుగలిగి ప్రళయకాలములో నసించుటవలన కాలపరిచ్ఛేదమువచ్చును.

ప్రశ్న. కాలమే బ్రహ్మమని చెప్పవచ్చునా?

ఉత్త. కాలమైనది యేకవ్యాపకమై నిరవయవముగా నే దేశములోవ్యాపించియుండినను దేశాచారములచేత గాలక్రియలు వాటిచేత గలుగు వస్తువులుతిరిగి నసింపవచ్చుటవలన కాలమునకుగూడ దేశపరిచ్ఛేదమువచ్చును.

ప్రశ్న. దేశమే బ్రహ్మమని చెప్పవచ్చునా?

ఉత్త. దేశమైనది యెచ్చటనువ్యాపించియుండిన నొక దేశములోనుండు వస్తువు మరియొక దేశములో లేమిచేత దేశమునకు వస్తుపరిచ్ఛేదమువచ్చును.

ప్రశ్న. వస్తువే బ్రహ్మమని చెప్పవచ్చునా?

ఉత్త. వస్తువైనది వ్యాపకములేక ఖండముగాను, పరిచ్ఛిన్నముగాను అనిత్యముగా నుండుటవలన వస్తుపరిచ్ఛేదము వచ్చును. గనుక కాలముచేత నాకాశమునకున్ను దేశముచేత కాలమునకున్ను వస్తువుచేత దేశమునకున్ను నసింపవచ్చుటవలన అవిఅంతయు బ్రహ్మస్వరూపము కాజాలదు.

ప్రశ్న. అయితే బ్రహ్మస్వరూపము యేవిధమైనది ?

ఉత్త. దేహేంద్రియాది కరణములు వాటియొక్క చేష్టలు లేకను కాలదేశవస్తు పరిచ్ఛేదరహితముగాను అఖండపరిపూర్ణముగాను అపరిచ్ఛిన్నముగాను చిన్మాత్రముగానుండు జ్ఞానవ్యాపకమే బ్రహ్మస్వరూపము.

ప్రశ్న. బ్రహ్మమునకు త్రివిధపరిచ్ఛేదము లేదనుట యేది ?

ఉత్త. ఏకాలములోను, ఏదేశములోను, ఏవస్తువులోను, లోపటబయట అణుప్రమా[illegible]ణమునందు లేక సర్వవ్యాపకముగా జ్ఞానము లేక జగచ్చిత్రపటమువలెను పర్వతమువలెను చలనము లేక నిస్మరణముగానుండుటవలన త్రివిధపరిచ్ఛేదము లేదనుటయే నిశ్చయము.

ప్రశ్న. ఆత్మవికారము లేక నిర్వికారముగానుండగా దేహేంద్రియాదులు పనులు చేయుటవలన నవియుకూడ నొకవస్తువని ద్వివిధవాదములు వాదించుదురా ?

ఉత్త. స్ఫటికరాయి యనునది కదలకుండవుండి దాని సన్నిధానఫలముచేత జడమైన సూదిపీడించి ఆస్ఫటికమును పట్టునటువలెను సూర్యుడు యిచ్ఛ లేకయుండి ఆసన్నిధానఫలముచేత జడమైన సూర్యస్ఫటికరాయిలో నగ్నిజనించి యందుచేత బాహ్యాదిక్రియలు జరుగుటవలెను ఆత్మప్రకాశముచేత ప్రతిఫలించిన ఛాయయైనది వృత్తిరూపమై జాగ్రస్వప్నములోనుండు విషయములను యింద్రియాదులద్వారా తెలిసి వ్యవహరించుచున్నవి. సుషుప్తి, మూర్ఛ, సమాధులలో వృత్తిలేమిచేత నొకటిన్ని తెలియకనున్ను వ్యవహారములున్ను లేవు. ఆత్మసన్నిధానబలముచేత చేయబడిన దే

తప్ప ఇంద్రియాదులు జడములే. దీనికి ప్రమాణము కైవల్యములో దిగువ చెప్పబడిన ప్రకారము ఉదహరించబడియున్నది.

మ॥ కదలింపన్గదలంగనోపనియయస్కాంతాచలాగ్రస్థలి।
స్సదయః పిండనిషండముల్గనలునాచందంబున జ్ఞైవులన్నదయ।
ప్రేరయప్రేరియమానములనూహింపన్నదా లేనిచి।
త్పదమందెల్ల జగచ్చయంబు భ్రమ చేతన్సంచలించున్ రహిన్॥

తా॥ కదలజేయుటకును, తాకదలుటకును, కూడనినూదంటురాతికొండ యొక్క ముందటిభూమియందు శ్రేష్టములై నయినుపముద్దల యొక్క సమూహములు కదలెడితీరున, చేష్టలనుమనస్సునందలి ప్రేరేపువాడున్ను ప్రేరేపింపబడినకార్యములను ఆలోచింపగా యెప్పుడును లేనట్టిపరబ్రహ్మమందు సమస్తలోక సమూహము భ్రాంతిచేత మిక్కిలి చలించునని తాత్పర్యము. ఇచ్చట నూదంటు రాతికొండ పరబ్రహ్మమునకును అయఃపిండములు లోకవ్యాపారములకును వుపమానములుగా జెప్పబడినవి. ఎట్లనగా నూదంటు రాతికొండయును యినుపముద్దలును అచేతనములు. అట్టి అచేతన పదార్థమైన కొండయొక్క శక్తిచేత దానిసాన్నిధ్యమందుండెడి యినుపముద్దలు కదలగా [illegible]రాకారుడును, నిరవయవుడును, నిర్గుణుడున్ను అయియుండియు ఆ పరబ్రహ్మచైతన్యుడుగానుండుటవలన ఆయన సాన్నిధ్యమందుండెడి సకలేంద్రియములు చలించుట యాశ్చర్యము కాదనిభావము.

ప్రశ్న॥ ఇంద్రియాదులు పనిచేయుక జడముగానుండినను ద్వైవిధమే తప్ప అద్వైతముకాదని చెప్పుదురా?

ఉత్త. తొంభైయారు తత్వములు సకలమతములకు సహజమనియు శైవులకు ముప్పదియారుతత్వములనియు, వేదాంతులకు యిరువదియెనిమిది తత్వములనియు, మాయావాదులకు యిరువదియైదు తత్వములనియు, వైష్ణవులకు యిరువదినాల్గుతత్వములనియు మఱియు,పదిహేడుతత్వములనియు, పందొమ్మిదితత్వములనియు, చెప్పుటయంతయు వాచామాత్రముగాని పంచతన్మాత్రలుతప్ప కాలత్రయమునోను లేదు. అదియేలాగనిన శబ్దమని యెఱుగునపుడు శబ్దమును దెలుసుకొన్న జ్ఞానముమాత్రముతప్ప సమానవాయువు శ్రోత్రేంద్రియము, వాగింద్రియము, వచనాదివిషయములు లేవు, స్పర్శమని తెలుసుకొన్నపుడు స్పర్శము, స్పర్శమని దెలుసుకొన్న జ్ఞానముతప్పమనస్సు, వ్యానవాయువు, త్వగింద్రియము, పాణేంద్రియము, ధనాదివిషయములు లేవు. రూపమని యెఱుగునపుడు రూపము, రూపమని యెరిగినజ్ఞానముతప్పబుద్ధి, ఉదానవాయువు, నేత్రేంద్రియము. పాదేంద్రియము, గమనాది విషయములు లేవు, రసమని యెఱిగినపుడురసము, రసమనియెఱిగినజ్ఞానము, చిత్తము అపానవాయువు, జింహ్వేంద్రియము, ఉపస్థేంద్రియము, ఆనంద విషయములు లేవు. గంధమని యెఱిగినపుడుగంధము, గంధమని యెఱిగినజ్ఞానముతప్ప యహంకారము, ప్రాణవాయువు, ఘ్రాణేంద్రియము, గుదేంద్రియముల విసర్జనాది విషయములు లేవు. ఈలాగు తన్మాత్రములు తప్ప వేరేతత్వములు లేమిచేత తన్మాత్రలను ప్రత్యేకప్రత్యేకముగావిభజించి చూడగా నవియుకూడ నొకటొకటివిడిచి యొకటి లేమిచేత నైదున్ను యొకటిగానుండుటచేతను, వీటికి గార్గ     మంను విక్షేపశక్తియును వృత్తిజ్ఞానముతో జూచుకాల

మందు లేమిచేతను ఆయావరణమొకటిన్ని దెలియలేము యని తెలుసుకొన్న జ్ఞానము మాత్రముగా ప్రకాశించి తెలియలేదనెడు యజ్ఞానము నసించిపోయినది. పిదప తనవ్యాపకములో సకల తత్వములగపడి పెరిగిలయమౌచున్నదని గనుగొన్నజ్ఞానమే మహాకారణమైన మూలప్రకృతికూడ వాచామాత్రముతప్ప వక వస్తువుకాదు.

ప్రశ్న. అదేలాగు?

ఉత్త. తనవ్యాపకములో నొకటియుండినట్లైతేకదా వుండవలయును. వుండినయడల లయముపొందవలెను. అట్లువుత్పత్తికాలేదు, పెరగనులేదు, లయించసులేదు, యని దెలుసుకొన్నజ్ఞానముగా సుండుటయేమూలప్రకృతి రహితమైన బ్రహ్మస్వరూపము. దీనికి ప్రమాణము,

—(*) అవధూతగీతాయాం. (*)—

శ్లో॥ సర్వంశూన్యంమనశ్శూన్యంసత్యాసత్యంహివిద్యతే ।
శో భావాభావితంప్రోక్తంశాస్త్రసమ్మతిపూర్వకం ॥

ప్రశ్న. ఈలాగుద్వివిధ వస్తువులులేకతానేతాసు గానుండుటనలో ద్వివిధ భావనలుఅయిన విపరీతములు ఎట్లువుండినట్లుదోచినది?

ఉత్త. లేనియజ్ఞానముదోచిన యింద్రియముల ద్వారాకాలత్రయములో లేనిశుద్ధ మిథ్యమైన విపరీతభావనలులేనిజలము ఎండమావుల లోనిజలమువలె వుండినట్టుకనబడెను.

ప్రశ్న. ఉండువస్తువులోనుండేది అగుబడునేగాని లేనిదిదోచునా?

ఉత్త. ఉండు ఇనుములో యిదిఆయుధమని దోచినది లేని ఆయుధము కలుగునా? ఉండుఇనుముగానేదోచినది. ఉండుబంగారములోయిది

ఆభరణమని తోచినద్ది లేని ఆభరణము లగపడునా? ఉండుబంగారే తోచినది. ఉండుమట్టిలో యిదిఘటమనితోచినది లేని ఘటముకనబడునా ? ఉండుమన్ను గానేతోచినది. ఉండుమ్రానులో యిది యేనుగగుఱ్ఱములవలెతోచినది. లేని యేనుగ గుఱ్ఱములు తోచునా? ఉండుమ్రానుగానేతోచినది, ఉండుసముద్రములో యిది అల, నురుగు, బుగ్గలవలెతోచినది. లేని అల నురుగు గుబ్బతోచునా? ఉండుసముద్రముగానేతోచినది. ఉండుఆకాశములో యిది నీల, పీతమనితోచినది. లేనినీలపీతమనితోచునా ? ఉండు ఆకాశమేతోచినది. ఉండుస్థాణువులో యిదిదొంగయని తోచినది. లేనిదొంగతోచునా ? ఉండుస్థాణువేతోచినది. ఉండురజ్జువునందు యిది సర్పముయనితోచినది. లేనిసర్పముతోచునా ? ఉండురజ్జువేతోచినది. ఈదృష్టాంతములవలె సచ్చిదానంద స్వరూపమైన తనవద్ద యిది నామరూపముగాఁదోచినది. ఉండు సచ్చిదానందమేతోచినదేగాని కాలత్రయములో నామరూపములు తోచనేలేదు.

ప్రశ్న. అది యేలాగు ?

ఉత్త. ఉండునదిసత్తు, అసత్తదానే నామరూపములైన చిత్తుగాదోచినది. చిత్తుతప్ప నామరూపములు అనునవి కాలత్రయములో లేదేగనుక, సత్తుతప్పచిత్తుఅనునది వేరేలేనిచేతనున్ను రెండవ వస్తువులేదు. అసత్తుచిత్తులయొక్క జంటయేకమై యుండుటవలన ఛాయయందే అంతఃకరణమందుదోచెడి నామరూపమునసించి నిరతిశయానందమౌను, లేని మాయ కాలత్రయములోను తోచబడదు. కైవల్యము పొందలుగాగల వృత్తిలో ప్రబంధములుండుట.

చేతగాలత్రయములోను మాయతోచబడదనేదేనిశ్చయము

—(*) దీనికిప్రమాణము. (*)—

మ॥ తగుదైౘిగుణ్యాజగంబుస్వప్న పురవంధ్యాపుత్రగంధర్వరా ।
ణ్ణగరస్థాణునరాభ్రపుష్పమృగతృష్ణావారిపాశాహిన ।
గ్గగనశ్యామలశుక్తికాప్యశశశృంగిభ్రాంతులర్కాబో ।
లియావగుమాసర్వమువీడిబ్రహ్మముమదీయాజ్ఞానిజప్రజ్ఞచే ।

తా॥ ఓయిశిష్యుడా సత్వరజస్తమోగుణములుగల ప్రకృతివికారమైన యీలోకము కలలోజూచినపట్టణమువలెను, గొడ్రాలిబిడ్డవలెను, గంధర్వ రాజుల నగరమువలెను, దారుపురుషుల వలెను, ఆకాశపుష్పము వలెను, ఎండమావులజలమువలెను, త్రాటియందుదోచిన సర్పమువలెను, స్వచ్ఛమైన ఆకాశమునందలి నలుపువలెను, ముత్యపుచిప్పయందలి వెండివలెను కుందేటికొమ్మువలెను అసత్యమగునుగనుక నీవునావుత్తరువుచేత నీపీజ్ఞానమువలన అసత్యమైన యీలోకమందుగల భ్రమనువదలిలోకాతీతమై వెలుగు సచ్చిదానందకూటస్థ పరబ్రహ్మమునీవగుమని తాత్పర్యము.

శ్న. మిథ్యమైన నామరూపములు కాలత్రయములోలేక అఖండసచ్చిదానంద స్వరూపముమాత్రమువుండగా యీజననమరణము మొదలుగాగల తాపత్రయములు, జీవేశ్వరభేదములు, బంధమోక్షములువుండేలాగు తోచినదెట్లు ?

త్త. ఆత్మనేదేహేంద్రియాదులులనిన్ని, దేహేంద్రియాదులేయాత్మయని వివర్థముగాచూచినదే యజ్ఞానము. ఆయజ్ఞానముచేతనాత్మయైన తన్ను అసత్యమైన నామరూపములుగా జూచినప్పుడే యద్వైతముకనబడక ద్వైతభావము కనబడెను.

శ్న. అదేలాగు ?

ఉత్త. మేఘముకదలుచు పరుగెత్తగా చంద్రుడు పరుగెత్తునటువలెను, జలముచలించునపుడు నిశ్చలమైనచంద్రుడు కదలునటువలెను, ఓడయెక్కి పోవువానికి గట్టుమీది చలనములేని చెట్లుపరుగెత్తివచ్చునట్టువలెను, కొరివికట్టెను చుట్టినట్టయిన సూర్యాకారమైన గుండ్రముగా దోచునటువలెను, మృగతృష్ణలో నీరుపరుగెత్తు నటువలెను, రసదర్పణమునకు నెదురుగానుండిన యిల్లువాకిండ్లు అద్దమునకు వెనుకతోచునటువలెను, అజ్ఞానముచేత నామరూపమైన ద్వైతభావముతోచినది. ఈప్రకారము అనేకగ్రంథములలో జెప్పబడియుండుటచేతను యిపుడు జ్ఞానదృష్టిచేత బూడగా జూచువాడు చూచునది చూడబడువస్తువు యీమూడున్ను పంచేంద్రియములతో జెడి యాదిత్యునిప్రకాశములో దీపప్రకాశము అణగియుండు రీతి సూర్యునిప్రకాశములో భూతతిమిరములు అణగియుండునటుల జ్ఞానమనెడు పెద్దకండ్లనుమూయబడిన యావరణమనెడు పొరతొలగును. అపుడునామరూపాత్మకమైన సకలదేహాదిప్రపంచములు తనలోలయమైతానేతానుగాప్రకాశించును. దీనికి అనేక శృతులలో ప్రమాణములున్నవి.

ప్రశ్న. సకలప్రారబ్ధ భోగములున్నదనియు జ్ఞానమువచ్చినను అనుభవించే తీర్చవలెనన్ని సకల శృతిస్మృతులు చెప్పుటయేగాక మనకున్ను అనుభవముగానుండుటవలన వస్తుద్వయము లేదని చెప్పుటయేలాగు చెప్పవచ్చును?

ఉత్త. ప్రారబ్ధభోగము అజ్ఞానదృష్టిచేత నభ్యాసకాలములో నున్నది. తత్వజ్ఞానోదయములో లేదని అభ్యాసికే ప్రారబ్ధములేప్ప ఆరూఢికి లేదనియు శృతిస్మృతులుచెప్పుచున్నవి. మాయనుభవమున్ను యిదియే.

ప్రశ్న. అది యేలాగు ?

ఉత్త. మేలుకొన్నవారికి స్వప్నము అసత్తయినటుల యదార్థజ్ఞానమున లో దేహాదులు అసత్తుగాబోవుటవలన ఆయాధికి ప్రారబ్ధము లేదు. వానికి సతితమైన బ్రహ్మప్రకాశమొకటియే, యేకముగా ప్రకాసించునుగనుక ఆస్వరూపమే నీవు అయినావు అనుటలో సందేహవిపరీతములులేక అద్వైతచిన్మాత్రస్వరూపముగానుండువుగాక, యిందుకు ప్రమాణము లనేకశాస్త్రములలో జెప్పబడి యుండుటవలన యీలాగుతానుగా ప్రకాసించుస్థితిలో కించత్తైనను అసంభావనమైనది గురువుచేతను శాస్త్రములచేతనుదీరదు. యీయసంభావనయుండు నతనికి స్వానుభవములో సందేహముకలిగి దీర్ఘస్థితిని బొందక తప్పిపోవుటవలన ఆత్మద్రోహియనియు బ్రహ్మద్రోహియనియు చెప్పుటయేగాక దీనినిబోగొట్టుకొనుటకు యిందుకుపైన వేఱుఅనుభవములున్ను శాస్త్రములున్ను లేనిచేత యీద్రోహము దేనిచేతను తొలగదని నాలుగుఉపనిషత్తులు జెప్పుచున్నవి. ఇందుకు చతుర్థోపనిషత్తు ప్రమాణము.

శ్లో॥ సత్యంసత్యంపునస్సత్యం । నాస్తిసంశయినాంగతిః ।
అధోగతిస్తువిజ్ఞేయా । నిహానాస్తితత్త్వైవచ ॥౧॥
సంశయోహిగతిస్తేషాం । శాశవంయాంతిసర్వదా ।
యిహస్వర్గేసుఖంనాస్తి । నాస్తిసంశయతఃఫలం॥౨॥

అనిచెప్పియుండుటచేత అసంభావనకలుగుటకు యితర శాస్త్రములు చూడరాదు. అట్లుచూచెనేని దనయదార్థమైన స్వానుభవదృష్టి యడతెగకయుండి పూర్వపక్షముగాదలచి సావధానముగా విచారించి తెలుసుకొనవలెను. యీలాగు అనేకశాస్త్రములలో చెప్పియుండుటవలన అసంభావన, సంశయభావన, విపరీతభావనలువిడిచి తానేతానుగా స్వయంప్రకాశముగా, సత్యస్వరూపముగా, నిర్మలముగా, నిత్యతృప్తిబొంది అంతర్ముఖనిష్ఠమైన [illegible]సమాధికలవాడై ఘనానిష్ఠులుగా ప్రకాసించినాడు. ఇందుకుసంశయములేదు. నిశ్చయము.

—(౦) ఉపశాంతిప్రకరణము సంపూర్ణము. (౦)

# నిర్వాణ ప్రకరణము.

———:౦:———

పూర్వము చెప్పిన అయిదుప్రకరణములవల్లను సర్వముతానుగా బ్రకాశించు స్వరూపశమనము పొందిన జీవన్ముక్తిసాక్షాత్కారతుర్యానుభవస్థితిలో స్థిరమైయుండు శిష్యునికిపై నసిపదలక్ష్యార్థమైన అఖండానంద తుర్యాతీత స్వానుభూతిమాత్రము గ్రహించియుండు విదేహముక్త్యనుభవము సిద్ధించుటకు నిర్వాణప్రకరణమును జెప్పుచున్నారు.

శ్లో॥ శైవంపాశుపతంవామం । కళాముఖమహావ్రతే ।
షడంతర్భైరవంప్రోక్తా । స్సమయాద్వైతసమ్మతాః ॥౧॥
లోకాయుతంచమీమాంసా । బౌద్ధంచమనమేవచ ।
మాయావాదంపాంచరాత్రం । షడ్బాహ్యాఃపరికీర్తితాః ॥౨॥
ఏతేషాంద్వాదశానాంచ । శాస్త్రాణ్యుక్తాన్యథిత్యదై ।
వనశృతిన్నృణాంభ్రాంతి । స్స్వజ్ఞానధ్వంసినిసదా ॥౩॥
యేనభ్రాంతత్వాదయోనష్టా । జ్ఞాత్వావేదాంతముత్తమం ।
విమృశ్యాధీయతేయేత । త్తేత్యజంతిభ్రమాదికం ॥౪॥

—(*) పీటికి వివరం. (*)—

ప్రశ్న. సమను వాస్త్రవ్యములో నిలిచియుండు సమయములకు ముక్తి కలదా ?

ఉత్త: శైవం, పాశుపతం, కళాముఖం, మహావ్రతం, వామం, భైరవం ఈ యారును అంతరసమయములనియు, లోకాయుతం, మీమాంసము, బౌద్ధం, శమనం, పాంచరాత్రం, మాయావాదం, ఈయారున్ను బాహ్యసమయములనియు చెప్పబడును. వాటిలో అంతర

సమయములలో శైవమనునది యీశ్వరుకలిగినజ్ఞానము. శివుడు దెలుపగా జీవుడు దెలుసుకొనువాడనిన్ని శేషత్వము నీచత్వము గానుండవలెనని జెప్పును. పాశుపతనమనగా, పరమాణు ఉపాదానముగానిలిచివాటిసంయోగమే కారణముగా ప్రపంచసృష్టిచేయబడినదనియు ఈశ్వరుడు నిమిత్తకారణముగానుండుననియు జీవకోట్లంతయు త్రిమలములచేత గట్టబడినవారుగా జెప్పుటయేగాక అగమములు ఘోషించుమేరకు అవాహనముచేసి యర్చించి బంధములనుత్యజించి అణువైనజీవుడు శివమయమైన పతినికూడుననిచెప్పును. కళాముఖం, మహావ్రతం, అను యీరెండున్ను అత్యంత జడలుమొదలైన గురుతులుగొని భక్తితోను శివుని అర్చించినియమము చెడకయుండునట్లయిన కర్మశరీరము విడుచునపుడు శివలోకమును బొందవచ్చును. అదియే మోక్షమని చెప్పును. వామమనగామధుమాంసము గొనిశక్తియైనస్త్రీలనుపూజించివారలశేషముభుజించి ఆశ్లోకయూ వంసములోనుండుటయే మోక్షమనిజెప్పును. భైరవమనునది స్మశానములో నుండుటయుముకలు ధరించి బూడిదెబూసి వృషవాహనముగానుండి యీభైరవమును హోమముచేసి నరబలియిచ్చి ఆనరమాంసమును, మధువును కపాలములోనుంచి హోమములో ఆహూతిచేసి మధువునుమాంసమును మరుసటిదినము భుజించునది యేపారణమనిన్ని యిట్లుచేసి ముగించినదే నిర్వాణమైనమోక్షమని చెప్పును. మీమాంశమనునది పశుయాగముచేసి ఆయాగబలముచేత దేవతలుగాస్వర్గములోనుండుటయేమోక్షమనిన్ని వేదాధ్యయనముచేసిన శబ్దమే బ్రహ్మమనిచెప్పును. బౌద్ధమన్ననది యింద్రియములయొక్క తెలివి

యేజ్ఞానమనియు భూతాకాశమే ఆత్మయని చెప్పును. శమమనునది యింద్రియనిగ్రహుడుగా కామములో బ్రవేశించక రాత్రులయందు భుజించుటవదలి దేహమునురోసి వెంట్రుకలుపెంచియుండుటయు సూర్యునితో కలయుటయని చెప్పును. పాంచరాత్రమనునది అదిమూలమైన విష్ణువేతన మాయచేత బ్రపంచము జీవులనుసృజించినాడనియు ఆమాయయే అతనికి రూపమనియు, వసుదేవుడు మొదలగునాలుగురి సమారాధనముచేతను జీవులుబంధమునువిడిచి పరమపదమును బొందుచున్నారని చెప్పును. మాయావాదమనునది నేనను అహంకారమే బ్రహ్మము అతనికి యొక వికారములేదు వారిసన్నిధానవిశేషముచేత మాయచేష్టించినదై ప్రపంచముజీవులను సృష్టిచేసినదని బంధమోక్షములులేదనిచెప్పును. ఈపంద్రెండులో (శైవం, వైష్ణవం, శాంక్తేయం, సౌరవం) (పాషండములు) విరోచనము, చార్వాకము, ఉపాసకము, క్షణికవాదము, అంతరాళము, ఆగమము, దిగంబరం, ప్రభాకరం, తార్కికం, భట్టం, సాంఖ్యం, యోగం, పతంజలియం, విశ్వరూపం, ప్రజాపత్యం, గాణాపత్యం, కౌమారకం, పౌరాణికం, కర్మశాస్త్రం, అనిచెప్పబడు అనేకమతములున్నవి. వారలందరు వారివారి మతాభిమానమే హెచ్చుగాదలచి మంత్రవాదం, రసవాదం, మొదలయినశాస్త్రములు నారంభించి భ్రాంతులైవసించిరని పంచదశప్రకరణములలో బ్రమాణములుండుటచేత సన్షయులకుముక్తిలేదు.

ప్రశ్న. శివవాదులలోను ఈశ్వరుడుకూడ భ్రాంతుడు అనిచెప్పవచ్చునా?

ఉత్త. స్వప్నములో భిక్షమెత్తువానికంటె రాజుగానుండువాడు అధి

కుడుగాయుండినను మేలుకొన్నతరువాత ఈరెండు స్వప్నములు మిథ్యయైనరీతి ద్వివిధవాదులుకల్పితేముచేత తారతమ్యముగానుం డినను జ్ఞానమువచ్చినవానినిగురించి ద్వివిధవాదులున్ను భ్రాంతు లేయని చెప్పవచ్చును.

ప్రశ్న. ఈలాగు వేదాంతవిచారముచేత వస్తునిర్ణయముచేయుట వలన ఆవాదులకంతయు విరోధమువచ్చునా ?

ఉత్త. ఒకటేవస్తువని చెప్పే వేదాంతికిన్ని దానినే గృష్టివాదుడేనుగమచూ చినచందంబుగా జూచివుందుమరివాదులకుకొంచమైనను విరోధము లేదు.

ప్రశ్న. ఒకటే వస్తువని చెప్పే వేదాంతమునకున్ను ఇకయుండు మరిము లంతయుమాయామయమని చెప్పుటకు ప్రమాణములున్నవా ?

ఉత్త. ముప్పదిరెండు ఉపనిషత్తులే ప్రమాణమని పంచదశప్రకరణములో నిరూపించియుండుటయే ప్రమాణనిశ్చయము.

ప్రశ్న. విచారజ్ఞానముచేత వస్తువునిర్ణయముచేయుటయెట్లు?

ఉత్త. షడ్లింగతాత్పర్యయుతో వేదాంతవిచారముచేసిన. శ్రవణఫలము చేతవస్తునిర్ణయముచేయవలెను.

ప్రశ్న. అదియేలాగు

ఉత్త. శ్లో॥ ఉపక్రమోపసంహార । స్త్వభ్యాసోపూర్వతాఫలం ।
అర్థవాదోపపత్తీచ । షడ్లింగాన్యర్థసంగ్రహే ॥

టీక॥ ఉపక్రమము, ఉపసంహారము అనిఒకటి. అభ్యాసము, అపూ ర్వత, ఫలం, అర్థవాదము, ఉపపత్తియని ఆరువిధములు.

ప్రశ్న. ఉపక్రమమేది ?

ఉత్త. అఖండపరిపూర్ణ సచ్చిదానంద బ్రహ్మమునందు రజ్జువునందు సర్పము అగుపడినభంగి సకలబ్రహ్మాండపిండములయిన జగత్తుకలిగినది. ఈసృష్టికిముందు బ్రహ్మం సత్తామాత్రముగాయుండినదని బ్రతిపాదించుటయే ఉపక్రమము.

ప్రశ్న. ఉపసంహారమేది ?

ఉత్త. ఉత్పత్తియైన సకలజగత్తు అపవాదక్రమముగాలయమగుటచేత బ్రహ్మాండపిండములను ఉపాధిలోకూటస్థునికి బ్రహ్మమునకు ఉండు ప్రపాధులనుదొలగించి ఐక్యత్వమును జెప్పుటయే ఉపసంహారము. ఈ రెండును ఒకలింగము.

ప్రశ్న. అభ్యాసమనునదియేది ?

ఉత్త. ప్రత్యగాత్మయైనబ్రహ్మము నీవేయని తొమ్మిది విధములుగా నుపదేసించుట ‹‹ఛాందోగ్యోపనిషత్తులో తత్వమసిమహావాక్యమును, ఉద్దాలకమహాఋషి తనకుమారుడైన శ్వేతకేతువునకు తొమ్మిది విధములుగానుపదేసించినారు. వాటినిచూడ యిష్టముగలవారు ఆయుపదేశము చేతనునిగూర్చి చెప్పుటచేత చేతనునికే అద్వైత ఆత్మతత్వముబోధించుటవలన నదియే అభ్యాసము.

ప్రశ్న. తొమ్మిది విధములుగానుపదేశించు ప్రపదేశములుయేవి ?

ఉత్త. స్థూలశరీరములో వాత, పిత్త, శ్లేష్మములను భేదములవలన మూడుదోషములుగలవు. అవిరోగములకు కారణములయినవి వాటినినివర్తించుటకొరకు ధన్వంతరిఅయినవారు ఆయుర్వేదము ను జేసియున్నారు. అదేరాగున అంతఃకరణమునందు మలము, విక్షేపము, ఆవరణము అనుభేదములవలన మూడుదోషములు వున్నవి. అవిసంసారబంధమునకు కారణముగావున్నవి. వాటిని

నివర్తించుటకై శ్రీసచ్చిదానందపరమకారుణ్యమైన పరమేశ్వరుడు నాలుగువేదములను అగ్నినుండిపొగయేలాగు గలుగుచున్నదో ఆలాగుననా యాసముగా ప్రకటించియున్నారు. వాటియందుకర్మకాండ, ఉపాసనకాండ, జ్ఞానకాండయనుమూడు కాండములున్నవి. మలములనెడు పాపమును కర్మకాండమునందు చెప్పబడిన కర్మానుష్ఠానమువలన నివర్తియగుచున్నది. విక్షేపమనెడి చంచలత్వము ఉపాసనకాండలో చెప్పబడిన సగుణనిర్గుణోపాసనలవలన నివర్తి కలుగుచున్నది. ఆవరణమనెడి అజ్ఞానము జ్ఞానకాండలో చెప్పబడిన ఆత్మజ్ఞానమువలన నివర్తియగుచున్నది. ఈకారణముచేత యీజన్మమునందైనను, పూర్వజన్మమునందైనను చేసిన కర్మోపాసనవలన ఎవనికిమలవిక్షేపములు నివర్తియైయున్నవో దీనివలన ఎవనివివేకము వైరాగ్య షట్కసంపత్తి, ముముక్షుత్వమనెడు నాల్గు సాధనములనుపొందియుంటున్నాడో అటువంటివానికి ఆవరణదోషమొకటిమాత్రము శేషమైయుంటున్నది అటువంటి అధికారి ఉపనిషత్తైన జ్ఞానకాండ బ్రహ్మనిష్ఠాపరుడగు గురుద్వారా శ్రవణముచేసి ఆలాగు శ్రవణముచేసిన పరమార్థతత్వమైనదానిని మననిదిధ్యాసనము జేసి స్వరూపసాక్షాత్కారమువలన సకలమైన అనర్థములునివర్తి జేసి పరమానంద ప్రాప్తియగుమోక్షమునుపొందుచున్నాడు పైచెప్పబడిన ఉపనిషత్తులు అనేకవిధములుగా నుండినను వాటిలో శ్రేష్ఠమైనవి పది ఆపదింటిపైకి నాల్గు ఉపనిషత్తులలో జెప్పబడిన నాల్గుమహావాక్యములే అమృతసారముగా నున్నది వాటిలో సామవేదములో చెప్పబడిన ఛాందోగ్యోపనిషత్తులో ఆరవ అధ్యాయమునందు ఏడవశ్లోకమును. చివరదాకు-నానావిధయుక్తులతో తొమ్మిదివిధములుగా నుపదేశింపబడినతత్వమసి మహావాక్యమేశివామృతరసమనబడును. ఇదిసంస్కృతభాషలో కేవలవిస్తారముగా శంకరాచా

ర్థాలు వ్యాఖ్యానముచేసియున్నారు. వాటినిపరిశోధించుటకు యోగ్యముగలవారు దుర్లభమైయుండుటనుబట్టి సమస్తమైనవారల కనుకూలముగా యుండునటుల యిందులో వ్రాయబడినది. తొమ్మిదివిధములుగా చెప్పబడిన యీయుపదేశముయొక్క అర్థము చిత్తశుద్ధియును, ఏకాగ్రచిత్తముగలవారికే గ్రహింపబడును; యితరులకు గ్రహింపబడదు. అటువంటిచిత్తశుద్ధియున్ను గలుగుటకనేక సాధనములుండినను యీకలియుగమునందు నామధ్యానమే మేలైనసాధనమని శృతిలో చెప్పబడుచున్నది. దానిమీదమోక్షాపేక్షగలవారు వెనకచెప్పబడు పది అపరాధములువిడిచి ఈశ్వరనామములను అర్థముతో సదాచింతించవలెను. పదియపరాధములు యేవియనిన (1) సాధువునింద. (2) అసాధువులయందు ఈశ్వరనామ మహిమజెప్పుట (3) శివకేశవులయందు భేదబుద్ధి (4) శృతివాక్యములయందు అశ్రద్ధ (5) శాస్త్రవాక్యములయందు అశ్రద్ధ (6) గురువాక్యమునందు అశ్రద్ధ (7) ఈశ్వరనామార్థవాదము (8) అనేకపాపములను పోగొట్టుమంత్రంనాయందున్నదని విశ్వాసముచేత నిషిద్ధకర్మలను జేయుట (9) ముందుజెప్పబడ్డ విశ్వాసముచేత హితకర్మములను విడుచుట (10) ఈశ్వరనామ మితరధర్మముతో సమముగాజూచుట.

## తత్వమసిమహావాక్యము.

తత్వమసియనుమహావాక్యముసామవేదమునందు ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడిన మహావాక్యము తొమ్మిదివిధములుగా నుపదేశింపబడి యున్నది. వాటిలో ప్రారంభమున స్వేతకేతువుకున్ను తండ్రియైన ఉద్దాలకమహాఋషికిన్ని జరిగినసంవాదరూపమైన బోధకథసంగ్రహముగా వ్రాయబోవుచున్నాము. ఆకథయేమనగా, ఉద్దాలక మహాఋషికి స్వేతకేతువు అనుపుత్రుడుగలడు. ఇతడుతగినమైన విద్యాభ్యాసముచేయుటకుతగినయోగ్యుడని తలచియితనికి ఉపనయనముజేయవలయుననితలచినవాడై చెప్పుచున్నాడు,

ఓ శ్వేతకేతువా! మనకులమునకు తగినగురువువద్దకు వెళ్లి బ్రహ్మచర్యవ్రతముబూని విద్య అభ్యసించుటకుబోవలెను. సౌమ్యా! (ప్రియపుత్రా) మనకులమునగలిగినపురుషుడైనవాడు విద్యాభ్యాసము జేయక తానుమూర్ఖుడుగాతనకడపాత్రముకొరకు బ్రాహ్మణులబంధువులుగాదలచి యుండుటధర్మముగాదు. ఏకారణమునైనను తండ్రి గుణవంతుడుగా నుండినను తనయొక్క పుత్రునకు పనయనముజేసి సతనికి చదివింపకయుండినయడల ఆకారణమునుబట్టి పుత్రుడైనవాడు తండ్రినివిడిచి యితరదేశములకు వెళ్లియైనను విద్యఅభ్యసించవలసినది. ఈలాగు తండ్రిచెప్పెడికాల్లమందు శ్వేతకేతువునకు పండ్రెండు సంవత్సరములవయస్సు గలవాడుగా నుండెను. ఉపనయనము జేసుకొని తనయొక్క గురువునొద్దకు వెళ్ళితనకు యిరవైనాల్గుసంవత్సరముల వయస్సుగలవాడయ్యేవరకు నాలుగువేదములను అభ్యసించి వాటియొక్క అర్థమును గ్రహించి తనకు సమానులెవ్వరును లేరని మదించితనయింటికివచ్చెను. తండ్రి తనకుమారుని జూచి ముందుచెప్పబోవుప్రకారమే వానిగుణములున్నవని చెప్పుచున్నాడు.

— ఉద్దాలక ఉవాచ. —

శ్వేతకేతువా! నీవుయిటువంటి గొప్పమానసము గలవాడవై విద్వాంసుడవనిగర్వించి కైంకర్యము లేకయుండే స్వభావముకలిగిన దానికి మీఆచార్యులగుండాగ్రహించిన అతిశయమైనపదార్థమేది? ఏబ్రహ్మోపదేశమువలన వినబడినకార్యరూపమైన జగత్తువినబడినదో, యేవస్తువుమననము జేయబడనిదో, దేనిగుండామననము జేయబడుచున్నదో, యేవస్తువునిశ్చయింపబడనిదో దేనిచేత నిశ్చయించబడుచున్నదో అటువంటియుపదేశమును మీఆచార్యులవల్లవినివున్నావా? అనితండ్రిఅడిగెను.

— శ్వేతకేతు ఉవాచ. —

భగవాన్ ఆయుపదేశము ఏలాగుననున్నది ?

— ఉద్ధాలక ఉవాచ —

ఓపుత్రా! ఒకమృత్తికపిండము వలనఘటముగాగలకార్యములు మృత్తికయనియే నిశ్చయింపబడుచున్నది. నామముమాత్రమైనది. మృత్తికయే యదార్థము. మన్ను, బంగారు, యినుము, యని చెప్పబడును. యీమూడుదృష్టాంతములు తనకుమారునికి జెప్పి ఆయుపదేశము యీలాగుననున్నదని తండ్రిచెప్పెను.

—శ్వేతకేతు ఉవాచ.—

పూజితులైననాయొక్కగురువు నిశ్చయముగా తాముచెప్పినయుపదేశమును తెలిసినవారుకారు. అట్లావారికి తెలిసియుండిన యడలసద్గుణము భక్తి వారివెంబడి సేవచేయుచున్న శిష్యులు మొదలైన గుణములుగలిగిన నాకు యెందుకు జెప్పకయుందురు. దానివలన ఆయుపదేశమును తామే అనుగ్రహించవలయునని వినయపూర్వకముగా నడిగెను.

—ఉద్ధాలక ఉవాచ.—

సౌమ్యా! చెప్పుచున్నాను ఏకాగ్ర చిత్తముతో వినుము మొదట యీదిరి ద్వితీయసత్తుగానే యుండినది. అదిప్రారంభించి సత్తుయొక్క బ్రహ్మమునుంచి జ్ఞానపూర్వకముగా అగ్ని జలము పృథివి (అన్నము) చెప్పబడు మూడుభూతభౌతికముల యొక్క యుత్పత్తి చెప్పి వెనుక జీవబ్రహ్మైక్యముల యొక్క ఐక్యము తెలుపు తత్వమసియనెడు మహావాక్యమును తొమ్మిది విధములుగా నుపదేశము చేసిరి. ఆతొమ్మిది విధములైన నుపదేశములను తెలియపరుచుచున్నాను. అరుణిమహాఋషి పుత్రుడైన ఉద్ధాలకమహాఋషి తన పుత్రుడైన శ్వేతకేతువునకు సుషుప్తిని జెప్పుచున్నారు.

మొదటిభాగవుపదేశము. ఉద్దాలక ఉవాచ.

(1) పృథ్వి,జలము,అగ్ని అనుమూడుభూతములను నొకటికొకటికలిగిన సంబంధములను విషయముచేయు అవాంతరప్రకరణములను గురించి బ్రహ్మమునువిషయము చేయుమహా ప్రకరణమును చెప్పవలసినవాడై సుషుప్తిలోమానసులయముకాగానే జీవుడు సత్తుతో పొరలుచున్నాడు. అని చెప్పుటకుమునుపు చెప్పబడిన మనోవుపాధి యిటువంటిది అని తేటపరుచుచున్నారు. ఓసౌమ్యా! నావల్ల తెలుసుకొనుము. పురుషుడునిద్రించుకాల్లమందు ఆపురుషునకునిద్రబోవుచున్నాడని పేరుగలుగుచున్నది అప్పుడు సత్తుతో (బ్రహ్మముతో) యేకరూపము అగుచున్నాడు. అనగాపారమార్థ సత్స్వరూపమైన తనను బొందుచున్నాడు. దేనివలన తననుతాను బొందుచున్నాడో దానివలన పురుషునిద్రించుచున్నాడని చెప్పబడుచున్నాడు అదియేదనగా చిదానందాదిగుణములయొక్క సిద్ధివలన స్వాత్మప్రాప్తిపొందుచున్నది (2) జాగ్రత్స్వప్నములలో పడినవిషయాక్రమమును నివర్తిచేయుటకుబ్రహ్మమును పొందుటసుషుప్తి. ఆసుషుప్తిలో తెలియబడుచున్నది యేలాగనిన; శకునియనగా డేగతాడుతోకట్టబడి దశదిశలు యెగిరి వేరుస్థళము ఆశ్రయించక తననుకట్టబడిన స్థళమందు యేలాగువచ్చి చేరుచున్నదో అదేలాగున మనోవుపాధి కలిగిన జీవుడుజాగ్రత్స్వప్నములలో సుఖదుఃఖములను దిశాదిశలనుతిరుగ (అనగా అనుభవరూపమైన గమనముచేసి) వేరుస్థళమును ఆశ్రయించక ప్రాణరూపబంధము నిశ్చయముగా ఆశ్రయించును. దేనివలన మనోపాధిగలిగినజీవుడు ప్రాణబంధముగా కలిసియున్నదో దానివలన అదిప్రాణమును ఆశ్రయించుచున్నది, (3) ఈలాగునిద్రబోవుచున్నాడు అనునది విశేషాంతమునుబట్టి జీవుడు సత్స్వరూపమైన జగత్తుయొక్క మూలమును పుత్రునకుజూపించుచున్నాడు

అన్నము మొదలైన కార్యకారణముల యొక్క పరంపరముగా జగత్తుకు మూలమైన సత్తును జూపుచున్నాడు. ఓసౌమ్యా! నావల్ల ఆకలిని దప్పిని తెలుసుకో. ఏకాలములో పురుషుడు భోజనము చేయుటకు కోరుచున్నాడో అప్పుడు ఆపురుషునకు భోజనము చేయ కోరుచున్నాడను పేరు అతనికి కలుగు చున్నది. అప్పుడు వాడు భోజనము చేసిన అన్నమును వానితో త్రాగబడిన జలముతో కూడి లోపల బోవుచున్నది. ఆనగా కఠినమైన అన్నమును మృదువుగా జేసి రసము మొదలైన రూపముగా మారి దేహమునకు వ్యాపింపజేయుచున్నది. గోపశుపరిపాలన జేయువాడు గోపాలుండని, గుఱ్ఱములను పరిపాలన చేయువాడు అశ్వనాయకుండనిన్ని, పురుషులను పరిపాలన జేయువాడు పురుషనాయకుడని యేలాగు చెప్పబడుచున్నాడో అదేలాగున భుజించిన అన్నమును పక్వము చేయునటువంటి యుదరములో త్రాగినజలము అన్నము పానము జేయుటవలన అశనాయకుడని పేరుగలిగినది. అలాగు భోజనము చేసిన అన్నమును భాగము చేయుచున్నది. అప్పుడు మాంసము మొదలయిన వాటితో యీశరీర కార్యము కలుగుచున్నది. ఓసౌమ్యా! ఆకార్యమును తెలుసుకొనుము. ఈశరీరమయిన కార్య మూలము లేనిది కాదు. యీశరీర కార్యమునకు అన్నమును వినహా వేరే మూలము యెక్కడయున్నది. గనుక అన్నమే మూలము. (4) ఓసౌమ్యా! ఈలాగుననే అన్నమైన కార్యమువలన జలమైన మూలమును తెలుసుకో. జలమైన కార్యమువలన తేజస్సయిన మూలము తెలుసుకో. తేజోరూప కార్యమువలన సత్తురూపమూలమును తెలుసుకో. సత్తు అన్నిటికిని మూలకారణముగా యున్నదో అటువంటి సత్తు స్థావర జంగమరూపమైన సర్వజగత్తు అని యెరుగుము. ఈసత్తుస్థితి కాలముతో దేనికి ఆశ్రయముగా యుంటూయున్నదో దేనికి ప్రతిష్ఠగా యుంటూయున్నదో అదియే సత్

కలప్రజలు. (5) ఏకాలములో పురుషుడునీళ్లను త్రాగుటకుకోరుచున్నా డో ఆకాలములో ఆపురుషునికి నీళ్లుత్రాగెడి వాడనిపేరు కలుగుచున్నది. అప్పుడుశరీరములో యుండేఅగ్ని అంగమైన తేజస్సు పానము చేసినఆజల మునుతీసుకొనిపోవుచున్నది. అదియేలాగనిన త్రాగినజలమును రక్తము మొదలైన ఆకారముగా జేయుచున్నది. ఏలాగున గోపాలకుండు అశ్వపాల కుడు, పురుషపాలకుడు అనునామాంతరములు కలిగినవో అదేలాగునఆతే జస్సు జలమును తీసుకొనిపోవుటవలన వుదకపాలకుడు అనిచెప్పబడుచు న్నాడు. అక్కడ జలమునకుశరీరరూపకార్యమే కలుగుచున్నదీ. ఈశరీర రూపకార్యము ఆకారణముకాదు అని తెలుసుకో (6) ఆశరీరమునకు జల మునువిడిచి వేరేయెక్కడ కారణమగును. జలమే కారణము. జలరూప కార్యమువలన తేజోరూపకారణమును తెలుసుకోనుము. ఈస్థావరజం గమమైన సకలముప్రజలు సత్తురూపమూలమని తెలుసుకొనుము. సత్తు రూపక్రియ ఆశ్రితమైనది. సత్తురూపప్రతిష్టలుకలదియై ప్రసిద్ధమైన తేజ స్సు, జలము, అన్నముయను మూడుదేవతలను అధిష్టానమైన బ్రహ్మము నుపొంది ఒక్కొక్కటి మూడేసివిధములుగానున్నది. వాటిని ముందు వుపదేశములోనే చెప్పబడియున్నది. తేజస్సు ఈలాగున జలము, అన్న ము అనుకార్యరూపమైన శరీరకార్యద్వారా సత్తేసత్యములో నారోపణ చేయబడినది. ఇపుడు మరణముద్వారా ఆయొక్కసత్తు నిరూపణచేయు టకు ప్రారంభించుచున్నాను. ఓసౌమ్యా! చచ్చువానియొక్క వాక్కు మనస్సులోను, మనస్సుప్రాణములోను, ప్రాణము తేజస్సులోను, ఆ తేజ స్సుపరదేవతలోలయమాచున్నది. (పరదేవత అనగా బ్రహ్మము) అ టువంటి సత్తురూపము అతిసూక్ష్మమైన అణువు. అది యీజగత్తుకు కారణరూపమై అతిసూక్ష్మముగావుంటూవున్నది, ఆయొక్క సత్తురూ

ప్రస్తైన ఆత్మస్వరూపముకలిగిన సర్వజనులు అదినే సత్యము, అదియే ఆత్మ ఓశ్వేతకేతువు అదియే తత్త్వమసి, అదియే నీవు.

— శ్వేతకేతు ౠవాచ. —

ఓభగవాన్! ప్రతిదినము సకలప్రాణులును సుషుప్తిఅవస్థలో స త్తును బొందుచున్నారని తాము శెలవిచ్చితిరి. అది నాకుసందేహముగాను న్నది యెందుకనగా దేనివలనసత్తును బొందియుంటున్నానో అదియెం దుకు తెలుసుకోలేను ఆహేతువుచేత నాకుసందేహము కలుగుచున్నది. భగవంతులైన తాము నాకుదృష్టాంతముతో తెలుపవలయునని మనవిచేసు కొనుచున్నాను. నాయందుదయయుంచి అనుగ్రహించవలెను. మంచిది ఓసౌమ్యా! అదేలాగున చెప్పుచున్నాను వినుము.

రెండవఖండోపదేశము. ఉద్ధాలకవువాచ.

(1) ఓసౌమ్యా! తేనెటీగె తేనెను కలుగచేయుచున్నది నానా విధచెట్లయొక్క రసమును జేర్చి ఆరసములో మధువనెడి ఐక్యమును సం పాదించుచున్నది. (2) ఆరసము ఆతేనెలో ఉన్నట్టిను యొక్క రసముని భేదజ్ఞానమును పొందుటలేదు అదేలాగున ఓసౌమ్యా! నిశ్చయము గా యీసకలప్రజలును సుషుప్తి, మరణ, ప్రళయమనుకాలములో సత్తు లో ఐక్యముచుబొందియు సేనసత్తునుబొందియున్నానని తెలుసుకొనవ డంలేదు (3) ఆయాత్మయీప్రపంచములో వ్యాఘ్రము లేక సింహము లేక తోడేలు లేక పంది లేక పురుగులు లేక మిడతపురుగులు లేక యీగలేక దోమలేక యేదేదిగాగలుగుచున్నదో అదే ఉత్పత్తికాలములోయుండినా యున్నది (4) అది అణురూపము, సూక్ష్మము, అదియే ఆత్మ, అదియే యీజగత్తు, అదియేసత్యం, అదియేతత్త్వమసి, అదియేనీవు.

— శ్వేతకేతు ఉవాచ. —

లోకములో తనగృహములో నిద్రించుపురుషుడు అన్యగ్రామానకు పోయినవాడు తనయింటికినుంచి వచ్చినాడని తెలుసుకొనుచున్నాడు

అదేలాగున సుషుప్తినుంచి లేచినజంతువులకు నేనుసత్తునుంచివచ్చినానని విశేషజ్ఞానము పొందుకులుగ లేదు ? దానివలన భగవంతులైనతాము నాకు తెలుపవలెనని కోరినాను. ఓసౌమ్యా! అలాగే తెలుపుచున్నా నువినుము.

## మూడవభాగ ఉపదేశము.

— ఉద్ధాలక ఉవాచ. —

(1) ఓసౌమ్యా! పూర్వదిశనుపీక్షించిబోవదగిన గంగ మొదలగు నదులు తూర్పుదిశ నేబోవుచున్నవి. పశ్చిమతట్టుపొయ్యేసింధు మొదల గు నదులు పశ్చిమతట్టేపోవుచున్నవి. ఆనదులు మొదట సముద్రజలమే వర్షముగాకురిచి ప్రవాహరూపమై ఆసముద్రములోనే కలసి తద్రూప మౌచున్నది. ఆసముద్రజలములో యిదిగంగ, యిదియమున, యిదిసిం ధూయని విభజించి తెలుసుకొనుటకుపీలులేదు. (2) ఓసౌమ్యా! ఈ లాగుననే నిశ్చయముగా యీసకలప్రజలున్ను సుషుప్తిమొదలైనవాటి నుండి లేచుకాలమందు సత్తునుంచివచ్చినామని తెలుసుకోవడంలేదు. ఆ జీవుడు ఈప్రపంచములో పులిలేక, సింహములేక, పందిలేక, కీటకములేక, పక్షిలేక, ఈగలేక, దోమ మొదలైనవి సుషుప్తిఆదిగాగల సత్తునుబొం దియున్నవో ఆపులిమొదలైనవి అప్పుడులేచేకాలమందు సత్తునుంచివచ్చిన వి. అటువంటి అణురూపమైనఅతిసూక్ష్మమే అదియేసర్వజగత్తు, అదియే సత్యం, అదియేఆత్మ, అదియేతత్వమసి అదియేనీవు.

— శ్వేతకేతు ఉవాచ. —

సముద్రజలమునందుతేరంగములు, అలలు, నురుగులు, బుగ్గలు, తుం పురులు, మొదలైనవిబుట్టి భేదాభేదరూపముగాపరిణమించి అందులోనే లయించుచున్నవి. అదినేనుచూచినాను. జీవకోట్లు సుషుప్తి, మరణ

ప్రళయకాలములలో ప్రతిదినము అసత్తురూపకారణమును పొందుచున్నవి. అట్లయినను నాశనమగుటలేదు, అందువల్ల భగవంతులైనతాము మరల దానిని తెలుపకోరుచున్నాను. అట్లనే తెలిపెదను.

నాలుగవభాగ వుపదేశము.

— ఉద్ధాలక ఉవాచ. —

ఓసౌమ్యా ! ఎదురుగావుండే వకపెద్దచెట్టును ఒకపురుషుడుగొడ్డలితో అడుగుభాగమునరికినాడు, అపుడు ఆచెట్టు యెండిపోలేదు. అయితే జీవించుచునేయున్నది. ఆయుధముయొక్క దెబ్బవలన దానియొక్క రసముకారుచున్నది. మధ్యనరికినను జీవించేయున్నది, రసముమాత్రముకారుచున్నది. కొనలలోనరికినను జీవించేయున్నది, రసముమాత్రంకారుచున్నది. ఆచెట్టుయొక్క జీవాత్మవలన వ్యాపకమైమిగిలె, జలమును భూమినుంచి యేదిస్థిరముగాయుంటున్నది? మరియును ఆనందమునుబొందిస్థిరముగాయుంటున్నది. (2) యెప్పుడు ఆచెట్టుయొక్క శాఖనుంచి జీవుడువిడుస్తున్నదో (ఉపాధివలన చెట్టుయొక్క శాఖ) అపుడు యెండినట్టుగాయుంటూయున్నది. యెపుడు రెండోశాఖయెండుచున్నదో అప్పుడు ఆకొమ్మయొక్క జీవత్వము వియోగమౌచున్నది. ఆలాగుననే ప్రతికొమ్మయొక్క జీవత్వము వియోగమౌచున్నదో అప్పటికిచెట్టుయొక్క సమూలముగా యెండుచున్నది. (అనగా ఆచెట్టుయొక్క జీవత్వము సమూలముగా అణగిపోవుచున్నది) అదేలాగుననిశ్చయముగా తెలుసుకోయని తండ్రిచెప్పెను. (3) ఏలాగునజీవత్వముతోకూడిన వృక్షముజీవిస్తూయున్నదో, జీవత్వములైన వృక్షముయెండిపోవుచున్నదో, జీవుడుచచ్చుటలేదు ఆలాగుననే జీవునినుండివియోగముబొందిన ప్రసిద్ధమైన యీశరీరము నిశ్చయముగా చచ్చుచున్నది. జీవుడుచచ్చేవాడుకాడు. అటువంటిది యేదియో అది యేఅణుస్వరూపం, అదియేసత్యం, అదియేఆత్మ, అదియే తత్వమసి,అదియేనీవు.

— శ్వేతకేతు ఉవాచ. —

ఈపృధివిమొదలగు నామరూపములుగల జగత్తుయేదియో అది అత్యంతసూక్ష్మమైన సత్తురూపము, నామరూపములేనియీసత్తునుంచి యే లాగునగలిగినది, దానిని దృష్టాంతపూర్వముగా భగవంతులైన తాము దయచేసిచెప్పవలయును అనినతండ్రిచెప్పుచున్నాను వినుమనెను.

— ఐదవభాగ ఉపదేశము. ఉద్ధాలక ఉవాచ. —

ఓసౌమ్యా! యెదురుగాగనుపడేమఱ్ఱిచెట్టునుంచి వకపండుతీసుకొనిరమ్ము.

శ్వేత:—ఏభగవాన్! ఆలాగుననేతీసుకవచ్చినాను.

ఉద్ధాలక:—ఆపండును రెండువ్రెప్పలుగాజేయుము.

శ్వేత:—ఆలాగుననేచేసినాను.

ఉద్ధాలక:—ఆపండులోయేమి ఉన్నదిచూచితివా?

శ్వేత:—ఏభగవాన్! ఆపండుయొక్క అతిసూక్ష్మమైన విత్తనమును జూచినాను.

ఉద్ధాలక:—ఓప్రియా! ఆవిత్తనమునుదీసి రెండుగాజీల్చిచూడుము.

శ్వేత:—ఆర్యా! ఆలాగుననేచూచినాను.

ఉద్దా:—వాటిలోయేమి అగుపడినది.

శ్వేత:—ఒకటి అగుపడలేదు.

ఉద్ధా॥ ఓసౌమ్యా! ఏఅతిసూక్ష్మమైన బీజములోప్రసిద్ధిగా కనుపడలేదో అటువంటి యీఅతిసూక్ష్మమైన బీజముయొక్క ప్రసిద్ధికార్యరూపమైన మఱ్ఱివృక్షముయెంతస్థిరముగా నిలబడియున్నది. ఓసౌమ్యా! వీటిలోశ్రద్ధజేయుము. అదేలాగున అటువంటి ఆయొక్కసత్తురూపము అదియే అతిసూక్ష్మము, అదియే బ్రహ్మము, అదియేజగత్తు, అదియే ఆత్మ, అదియేనీవు.

శ్వేత॥ అటువంటిసత్తుయీజగమునకుకారణమైనది. అయితే అదియెం

దుకు కనబడలేదు. కామువాటిని మరల దృష్టాంతపూర్వకముగా తెలుప కోరెదను. అలాగుననే చెప్పుచున్నాను.

— ఆరవభాగ ఉపదేశము. —

ఉద్దా॥ ఓసౌమ్యా! ఈఉప్పును తీసుకపోయి ఘటములోవుండే నీళ్లలో వేసిమరుదినం వుదయం నావద్దకుతెమ్ము అదేలాగున శ్వేతకేతువు చేసెను తనయొక్క పుత్రునిచూచి ఓపుత్రా! ఉప్పునునీళ్లలోవేసినావా? ఆఉప్పునుతీసికొనితెమ్ము. ఆలాగునతండ్రిచెప్పగా శ్వేతకేతువు ఆఉప్పుజలములోకనపడలేదని చెప్పెను,

ఉద్దా॥ ఓప్రియపుత్రా! ఆవుప్పునీళ్లలోకరిగిపోయినను ఆనీళ్లపైభాగమునుత్రాగుము. ఆలాగుననేకొమారుడుత్రాగెను. అప్పుడుతండ్రి చెప్పినదేమనగా పుత్రుడా! నీళ్లరుచియేలాగునవున్నది?

శ్వేత॥ ఓస్వామీ! ఆనీళ్లరుచి ఉప్పుగానున్నది.

ఉద్దా॥ ఆనీళ్లమధ్యభాగములో త్రాగి రుచిచూడుము? ఆలాగుననే పుత్రుడురుచిచూచెను. ఆనీళ్లరుచియేలాగుననున్నది?

శ్వేత॥ తండ్రీ! అదికూడావుప్పుగానేవున్నది.

ఉద్దా॥ పుత్రా! ఆనీళ్లయొక్క అడుగుభాగమును త్రాగుము?

శ్వేత॥ అలాగుననేపుత్రుడుచేసెను.

ఉద్దా॥ ఆనీళ్లయొక్కరుచియేలాగుననున్నదో చెప్పుము?

శ్వేత॥ అదియును ఉప్పుగానేయున్నదని చెప్పెను.

ఉద్దా॥ ఓసౌమ్యా! ఈలాగున ఆవుప్పుప్రథమములో దర్శన స్పర్శనములకు అగుపడుచుండెను. పిదపజలములోకలసినకాలములో దర్శనస్పర్శనములకు అగుపడలేదు. అయితే ఉప్పుయున్నట్లుగానే దేనివలనదెలిసికొంటివనగా అన్యవుపాయమువలన తెలుసుకొంటివి అనగా జిహ్వతో తెలుసు

కుంటివి. యిదేలాగున ఈ తేజస్సు,జలము, అన్నము, మొదలుగాగలకార్య మైన దేహములో ఆచార్యులవుపదేశమువల్ల ప్రసిద్ధమైన సత్తువున్నది. తేజస్సు, జలము, అన్నము మొదలైనకార్యములకు, కారణమేదియో అది యేమఱ్ఱిచెట్టుయొక్క సూక్ష్మమైనబీజమున తెయుండినట్టుయుండినిన్ని యిం ద్రియములచేగుండా తెలుసుకొనబడలేదు. జిహ్వతోవుప్పును ఏలాగున గ్ర హించినావో అదేలాగున కనపడుజగత్తుకు కారణమైన ఆయొక్కసత్తును అన్యవుపాయములచేత తెలుసుకొనుము. అటువంటిది అతిసూక్ష్మము, అటువంటిది జగత్తు, అదియేఆత్మ, అదియే "తత్వమసి" అదియేనీవు.

శ్వేత॥ ఈలాగునజగత్తుకుకారణమైన ఆసత్తువుప్పువలె ఇంద్రియములకు కనబడకయుండినను యేవుపాయములచేత తెలుసుకోతగినదిగాయున్నది. దేనిని తెలియుటవలన నేను కృతార్థుడ నౌదునో దేనిని తెలియకున్నందున కృ తార్థుడుకాకపోదునో అటువంటి సత్తును తెలియుటకుపాయమేది? భగవం తులైన తాము మరల జెప్పవలయును. ఆలాగుననే చెప్పుచున్నాను అని తండ్రి చెప్పుచున్నాడు.

ఏడవభాగవుపదేశము. ॥ ఉద్దాలక ఉవాచ,

ఓసౌమ్యా! ద్రవ్యమును అపహరించేవారొంగలు ఒకపురుషునిపట్టు కొని కండ్లుకట్టిగాంధార దేశమునుంచి తీసుకొనివెడలి నిర్మానుష్యమైన ఒకదేశములోవిడిచిపోతురు. విమ్మటఆపురుషుడు అచ్ఛటదిగ్భ్రమగలిగినవాడై వాడు పశ్చిమోత్తర,పూర్వాదిశలయందు తిరిగి ఈలాగుచెప్పుచున్నాడు. కండ్లుకట్టబడినవాడుగా యిక్కడయుంటూయున్నాను, నాకండ్లుకట్టియి క్కడనే తెచ్చి విడిచివారని అరచినాడు. వానిని ఒక దయగల పురుషు డు వానికండ్లకట్టువిప్పి పుత్తరపుదిక్కు గాంధారిదేశమున్నది, ఆదిశను పోవుటయేముక్తని చెప్పినాడు. ఆదయగలవానివలన చెప్పబడిన గ్రామమునకు

ప్రవేశించినమార్గమును నిశ్చయించుటకు సామర్థ్యమున్ను, పండితుడున్ను, యుక్తిపరుడుగానున్న గాంధారపు దేశపువాసముగల పురుషుడు ఒకఊరినుంచి మఱియొక ఊరికి విచారించుకొంటూ గాంధారి దేశము చేరినాడు. అదేలాగున యీకడ దృష్టాంతములో జీవుడు అను పురుషుడు జగత్స్వరూపమయిన సత్తుయొక్క స్వరూపమునుంచి తేజస్సు, జలము, అన్నము, మొదలగురూపములున్ను వాత, పిత్త, కఫ, రక్త, క్రొవ్వు, మాంస, యెముక, మజ్జ, శుక్ల, క్రిమి, మూత్ర, మల, వీటితోకూడుకొని సీతము, ఉష్ణము, మొదలగు అనేకద్వంద్వరూపమగు దుఃఖముకలిగిన ఈశరీరమనేవనములో మోహమనెడు గుడ్డతో కండ్లుకట్టబడినవాడై భార్య, పుత్ర, పశు, మిత్ర మొదలగు దృష్టాదృష్టమైన విషయములలో ఆశయనెడు త్రాడుతో కట్టబడినవాడై పుణ్యాపాపములు మొదలగు కర్మమనెడు దొంగలచేత బ్రయాసపొందినాడు. నేనుయిటువంటి వారియొక్క పుత్రుడను, నేను యిటువానియొక్క స్నేహితుడను, సుఖిని, దుఃఖిని, మూఢుడను, పండితుడను, ధర్మిష్టుడను, బంధముగలవాడను, పుట్టినవాడను, మోచకుడను, తగ్గినవాడను, పాపిగాయున్నాను, నాయొక్కపుత్రుడుచచ్చినాడు, నాద్రవ్యమునష్టమైనది, అయ్యోనేనుచెడిపోయినాను, నేనెట్లుజీవింతును, నాకుయేగతినాను, నాకురక్షణచేశేవాడుయెవడు, నేను అనేకవిధములుగా సంకటముతోయేడ్చినాను, అకాలములోఅకస్మాత్తుగా నాపుణ్యోదయముచేత పరమదయాళువుగా సత్తురూపబ్రహ్మమనెడు ఆత్మస్వరూపమును తెలిసినవారైన బంధములేని ఒకపరమనిష్టపురుషునిజేరినాను, ఆబ్రహ్మవిదుడు కరుణతో నాకు సంసారములో కలిగిన విషయదోషములను జూచుమార్గమును చూపగాదానివలన సంసారవిషయమునుంచి విరక్తిజెందిననాకు ఆచార్యులు చెప్పుచున్నారు.

యేమనగానీవు సంసారియో యిటువంటి వానియొక్క పుత్రుడనుమొ దలగు ధర్మములుగలవాడవుకావు. అయితే సత్తుయేదియో అదేనీవు, అ వ్వుడు అవిద్యతోకలిగినమోహమనేడు గుడ్డిబంధమునుంచి విడువబడి గాంధారదేశపు పురుషునివలె తనసత్తురూప ఆత్మనుబొంది సుఖమైతిని, ఎవనికి ఆచార్యుడు గలిగియుంటాయున్నాడో ఆపురుషుడు యీభావమును తెలుసుకొనుచున్నాడు. అటువంటి జ్ఞానికి మొదినరకు దేహముపడకుండాయున్నదో అంతకాలము ఆత్మనిష్టగలిగి యుంటాయున్నాడు. యె వ్వుడువానియొక్కదేహమువదలుచున్నదో అప్పుడు సత్తునుబొందుచున్నాడు. అటువంటిసత్తు, అతిసూక్ష్మం, అటువంటిసత్తువేజగత్తు, అదియేసత్యం, అదియేఆత్మ అదియే ‟తత్వమసి,” అదియేనీవు.

శ్వేత॥ అలాగైతే యీశరీరము విడిచిన తర్వాత సత్తుప్రాప్తిరూపమేసంసారియొక్క మరణక్రమముగా యుంటాయున్నది. విద్వాంసునియొక్క సత్తుపొందేక్రమముకాదు. మరణము బొందేవానియొక్క సత్తుప్రాప్తిబొందినవారున్ను, జీవన్ముక్తులున్ను, యేకమైన సత్తునుబొంది యుండగా యీరెంటికిగల తారతమ్యమును జెప్పవలసినది. అవస్యకమైతే ఆచార్యుని బొందినపురుషునివలె మరణమునుబొందిన పురుషుడు యే క్రమముచేత సత్తునుబొందుచున్నాడో ఆక్రమమును దృష్టాంతముతో మరలనాకుదెలుపవలయునని తండ్రినిమిక్కిలివేడుకొనుచున్నాడు. తండ్రియైన ఉద్ధాలకమహాఋషి అలాగే చెప్పుచున్నాడు.

— ఎనిమిదవధాగ ఉపదేశము. —

ఉద్ధా॥ ఓసౌమ్యా! జ్వరము మొదలగురోగములనుబొందిన పురుషునిబంధువులుచుట్టుకొని నేనుయెవరైనది మీాకు తెలుసునా, నేనుయెవరుచెప్పుమా యనియడుగుచున్నారు. అప్పుడుమరణముబొంద సిద్ధమై

యున్న పురుషునియొక్క వాక్కు మనస్సులోను, మనస్సు ప్రాణములోను, ప్రాణము తేజస్సులోను, తేజస్సు సత్తులోను యెంతవరకు లయము కాలేదో అంతవరకు ఆపురుషుడు తెలుసుకొనుచున్నాడు. యెప్పుడు మృతిబొందుటకు తయారు అయిన పురుషునియొక్క వాక్కు మనస్సులోను, మనస్సు ప్రాణములోను, ప్రాణము తేజస్సులోను, తేజస్సు సత్తులోను, లయమౌచున్నదో అప్పుడు తెలుసుకొనుట లేదు. అటువంటి స్థితి యేదియో, అతిసూక్ష్మము, ఆసత్తురూపమే యీజగత్తు, అదియే సత్యం, అదియే ఆత్మ, అదియే "తత్వమసి," అదియే నీవు.

శ్వేత॥ ఎప్పుడు మరణము జెందేవానికిన్ని, మోక్షము బొందిన వానికిన్ని, సత్తును బొందుట సమానమగుచున్నదో, అప్పుడు యీయిరువురిలో విద్వాంసుడు సత్తును బొంది జన్మము మొదలగు వృత్తులను బొందుట లేదు. జ్ఞాని పునరావృత్తిని బొందుచున్నాడు. వీటికి కారణమేమో దృష్టాంతపూర్వకముగా మరల జెప్పవలయునని వేడుకొనుచున్నాడు. తండ్రి ఆలాగే చెప్పుచున్నాను వినుమని యిట్లనియె.

తొమ్మిదవ భాగ ఉపదేశము.

ఉద్దా॥ ఓసౌమ్యా!, ఒకచోరుని వానిని చేతులకు సంకెళ్లు వేసి రాజభటులు పట్టుకొనిరాగా అప్పుడు కొందరు వీనిని యెందుకు పట్టుకొనిపోవుచున్నారు అని అడుగగా రాజభటులు చెప్పుచున్నారు. వీడు ద్రవ్యమును అపహరించిన దొంగయని చెప్పిరి. వానికి యితరులు చెప్పినదేమనగా వీనిని పరీక్ష చేయుటకుగాను వేడియినుపగడారు అగ్నిలో వేసి యెర్రగా కాల్చుడు. ఆపురుషుడు దొంగతనము చేసియుండినయెడల దానివలన తన్ను తానే అబద్ధీకముగా చేసుకొనుచున్నాడు యిటువంటి అబద్ధప్రజ్ఞ గలిగినవాడై అబద్ధము తనను కప్పబడి ఆకాలిన యినుము ముట్టుచున్నాడు దానివలన వాఁడు

కాల్పబడుచున్నాడు. పిమ్మట ఆరాజభటులవల్ల చంపబడుచున్నాడు. ఆపురుషుడు దొంగతనముచేయనివాడుగా యుండినయడల ఆయినుమువ లన యదార్థముమ బొందుచున్నాడు. యిటువంటి సత్యప్రజ్ఞగలిగినవాడు సత్యముతో తననుకప్పబడికాల్చివుండబడిన యినుము యెత్తుచున్నాడు. దానివలన వీడుదహింపబడలేదు. అబద్ధమైన దొంగతనముతో ఆరోపింప బడిన పురుషునివల్ల తానువిడువబడుచున్నాడు. అటువంటిసత్యప్రజ్ఞగలిగి నపురుషుడు యేలాగునదహింపబడుటలేదో అదేలాగునసత్తయినబ్రహ్మ ముయొక్క సత్యప్రజ్ఞగలిగినవాడును అబద్ధప్రజ్ఞగలిగినవానియొక్క శరీర ముపడిపోవుకాలమందు సత్తునుబొందుట సమముగాయుండినను విద్వాం సుడుసత్తునుబొంది మరల పులిమొదలగుదేహములను యెత్తుటకు జన్మము వృత్తినిబొందుటలేదు. అజ్ఞానియుయేలాగు కర్మముల చేసియున్నాడో ఆకర్మముయొక్క ఫలమునకు తగుమైనశరీరములుమరలబొందుచున్నాడు, దానివలన దేనియొక్క స్వరూపము ప్రతిజ్ఞ అప్రతిజ్ఞచేయుటవలన మోక్ష బంధమగుచున్నదో యేదిజగత్తుకుమూలము సర్వజగము దేనియందు ఆ శ్రయమో దేనియందులయింపుచున్నదో యది అమృతము, అభయము, శివము, అద్వితీయము, గానుంటున్నదో అటువంటిదేసత్తు, అదియే జగత్తు, యిదియేపారమార్థసత్తు,యిదియేనీఆత్మ,యిదియే॥తత్వమసి,'' యీలాగున తండ్రివలనచెప్పబడ్డ సత్తయినబ్రహ్మమును పుత్రుడైనస్వేతకేతువు అదియే నేనుఅని తెలుసుకున్నాడు. ఓం. తత్. సత్. ఓం॥

——ఉద్ధాలక మహారుషిచెప్పబడిన నవవిధమహావాక్యసంపూర్ణం.——

ప్రశ్న. అపూర్వతయేది?

ఉత్త. అష్టప్రమాణములలో ఉపనిషత్ప్రమాణముచేత ప్రత్యగాత్మలక్ష ణమును దెలుసుకొనవలసినదేతప్ప వేరేప్రమాణములచేత దెల్సుకొ కొనకూడదనుటయే.

ప్రశ్న. అష్టప్రమాణమేది?

ఉత్త. ప్రత్యక్ష్యము, అనుమానము, ఉపమానము, ఆగమము, అర్థాపత్తి అభావము, ఐతిహ్యము, సంభవము అని యెన్మిదివిధములు?

ప్రశ్న. వాటిలో ప్రత్యక్షప్రమాణముయేది?

ఉత్త. ప్రత్యక్షములో సందేహప్రత్యక్షము, విపరీతప్రత్యక్షము, యదార్థప్రత్యక్షమని మూడువిధములు. వాటిలోదారువునుజూచి దారువో లేక దొంగయోయని సంకల్పించినది సందేహ ప్రత్యక్షము. దొంగయని కల్పించినది విపరీతప్రత్యక్షము దారువుయని తెలుసుకొన్నది. యదార్థప్రత్యక్షమని చెప్పబడును.

ప్రశ్న. వీటిలో స్వరూపాభిప్రాయమేది?

ఉత్త. యదార్థప్రత్యక్షమునకు వక ప్రమాణము అవశ్యకములేదు. సందేహవిపరీతబుద్ధి నివర్తికే ప్రమాణములు అవశ్యము గనుక ఆచార్యులు ప్రజ్ఞానము బ్రహ్మమని ఋగ్వేదమహావాక్యమును ఉపదేశించగ శిష్యుడు, జ్ఞానము ప్రత్యక్షములో ప్రకాశించి నట్టిన దేహాదిజగత్తంతయు ప్రత్యక్షముగాకనపడుటవల్ల నేనుదేహమో జ్ఞానమో యనునదియే సందేహప్రత్యక్షము. నేనుదేహమని నిశ్చయించినదే విపరీతప్రత్యక్షము నేను బ్రహ్మమనినిశ్చయించినదే యదార్థప్రత్యక్షము. ఈయదార్థప్రత్యక్షమునకు వేరుప్రమాణములు అనావశ్యము. సందేహవిపరీతబుద్ధి నివర్తికే అనుమాన ప్రమాణము విచారించవలెను.

ప్రశ్న. అనుమానప్రమాణమేది?

ఉత్త. అనుమానములో ప్రతిజ్ఞ, హేతు, దృష్టాంతముయని మూడువిధములు వాటిలో పర్వతములోనగ్ని యుండుననుటయే ప్రతిజ్ఞధూమ

ముండినది కారణమనుటయే హేతువు అడవియందు అగ్నివున్న దనుటయే దృష్టాంతము.

ప్రశ్న. వీటిలో ప్రతిజ్ఞకుస్వరూపాభిప్రాయమేది?

ఉత్త. భూతములైనవి స్థాపించి భౌతికచరాచరమైన ఒక దేహమును గురించి ఈదేహములోని జ్ఞానమైన బ్రహ్మమున్నదని నిశ్చయించుటయే ప్రతిజ్ఞ.

ప్రశ్న. హేతువుకు స్వరూపాభిప్రాయమేది?

ఉత్త. దేహేంద్రియాదులలో జ్ఞానమునిలిచి భజించి తెలుసుకొనునది దేహేంద్రియాదులు జడమగుటవలన తెలుసుకొనుశక్తిలేదు. దేహేంద్రియాదులే తెలుసుకొన్నయడల, సుషుప్తి, మూర్ఛ, సమాధి, వీట్లలో దెలుసుకొనవలెను. ఆలాగు తెలుసుకొనలేమిచేత నింద్రియములలో విభజించుజ్ఞానము యుండునది. ఈజ్ఞానమునకు ఆధారమైన బ్రహ్మము వకటియున్నదనేదే హేతువు.

ప్రశ్న. దృష్టాంతములో స్వరూపాభిప్రాయమేది?

ఉత్త. ఒక దేహములో జ్ఞానమైన బ్రహ్మముండుటవలన ప్రపంచభూత భౌతికమైన సకలచరాచరదేహములో నుజ్ఞానమైనబ్రహ్మముండునని తెలుసుకొనుటయే దృష్టాంతము.

ప్రశ్న. అయితే యిందుకుముఖ్యప్రయోజనమేది?

ఉత్త. ప్రత్యక్షములోలేచినధూమమునుగని అప్రత్యక్షమైన అగ్నివుండునని దెలుసుకొన్నరీతివలె దేహేంద్రియాదులలోనుండి తెలుసుకొన్నజ్ఞానమును బ్రత్యక్షములోకని యెవరిచేత దెలుసుకొనగూడనిదిగా అవాఙ్మానసాతీతమైన బ్రహ్మమొకటియున్నదని తెలుసుకొనుటయే ముఖ్యప్రయోజనము అని చెప్పబడును. భూతభౌతికచరా

చరములలోను జ్ఞానమైనబ్రహ్మమున్నదని యనుమానములోగను బడినదేతప్ప ప్రత్యక్షములోగనబడలేదు. ఆబ్రహ్మము యేలక్షణముగలదిగాయున్నదో యేమోయనుబుద్ధినివృత్తిపరిహరించుకొనుట కు వుపమానప్రమాణము విచారించవలెను.

ప్రశ్న. ఉపమానప్రమాణమేది?

ఉత్త. గవయ మృగము ఒకటియున్నదని వినినవాడు ఆమృగమును తెలుసుకొనవలయునని యిష్టపడి తెలుసుకొన్నవారిని అడుగగా వారలు యేకదేశ దృష్టాంతముగా యీపశువువలెయున్నదని నుడువుటయే ఉపమానప్రమాణము.

ప్రశ్న. ఇందులోస్వరూపాభిప్రాయమేది?

ఉత్త. బ్రహ్మమును దెలుసుకొనకోరినవాడు బ్రహ్మస్వరూపము ఏలాగున్నదని పెద్దలనువినయముతో నడుగవారలు దానికి వక ఉపమానముచేతను ఏకదేశదృష్టాంతముచేతను తెలుపించవలసినదిగానుండుటచేత ఆబ్రహ్మము సచ్చిదానంద స్వరూపలక్షణముగా నీభూతాకాశమువలె వ్యాపించియున్నదనిచెప్పగా ఆకాశలక్షణమేమనియడుగ ఆకాశము నాలుగుభూతములకు ఆధారముగా తానొకటితో చేరకయుండుటవలన నాలుగుభూతములకు ఆకాశము తప్ప వుండుచోటు లేమిచేత నాలుగుభూతములకు ఆకాశమే ఆధారముగానుండుటవలన ఆయాకాశమునే ఘటాకాశ, మఠాకాశ, జలాకాశ, మహాకాశము అని ఉపాధివశముచేతగని చెప్పబడునప్పుడున్ను ఆయాకాశమునకు ఈనాలుగు భూతములనుగురించి వచ్చిన యుపాధులుకొంచమైననులేక ఈనాల్గుభూతములనుమింగి యతిక్రమించి అవయవమ్ములేక నిరవయవముగా నుండుననివిని

ఈబ్రహ్మము ఈలక్షణముతోనుండునని పరోక్షముగా దెలుసుకొనడమే అభిప్రాయము. ఈలక్షణముకలిగిన బ్రహ్మమైనదివుండు చోటుతెలియలేదేయనుబుద్ధి వృత్తిపరిహరించుకొరకు ఆగమ ప్రమాణమువిచారించవలెను.

ప్రశ్న. ఆగమ ప్రమాణమననేమి ?

ఉత్త. స్వర్గలోకములో అమృతమున్నదనియు కాసిలో హరిశ్చంద్రుడు స్మశానములో కావలియుండినమంచకాలు ఇంకయున్నదనియు ఆగమము చెప్పగావిని దానిలో నిశ్చయబుద్ధివచ్చినదే ఆగమ ప్రమాణము.

ప్రశ్న. ఇందులోస్వరూపాభిప్రాయమేది ?

ఉత్త. ఏకమేవాద్వితీయం బ్రహ్మయను శృతివాక్యమున్ను దేహబహిరంతరములయందును, తూర్పుపశ్చిమములయందును, ఆకాశము భూమియందును, నేనులేనిస్థళములేదు. అను శృతివాక్యమున్ను ప్రకాశముతానుగానుండిన బ్రహ్మమేయదియను ఉపనిషత్తు వాక్యము ప్రమాణములుగా చెప్ప శ్రోత్రవిషయముగావిని తనవద్ద సచ్చిదానంద స్వరూపలక్షణమున్నదాయని విచారించునపుడు జన్మాంతరకర్మముచేత నీశరీరము యిప్పుడువచ్చినదనిన్ని, యిపుడు చేయుకర్మములవల్ల యికముందువచ్చుకాలములో, దేవ, మనుష్య, తిర్యగాదిజన్మములువచ్చునని యనుభవముయుండుట వలన సత్తుఅయినది. మరియు త్రికాలములోనుత్పత్తియైన శరీరములు మొదలగునవి నసించుటయు వాటివల్ల సుఖదుఃఖమానాభిమానము హానియు వృద్ధియు లాభాలాభములు జ్ఞానముగానుండి తెలుసుకొనుటవలన చిత్తుఅయినది. మరియు సత్తువేరు, చిత్తువేరుళ్లుని

విభజించిచూచినప్పుడు రెండుగా లేమిచేత నానందమైనది. మరియు బంధము లేకయుండగా దేహేంద్రియాది కరణములకు జ్ఞానముతప్ప వుండు-చోటు వేరు లేమిచేత జ్ఞానమేవాటికి ఆధారభూతముగానుం డుటవలన యీదేహేంద్రియాది కరణములకు అజ్ఞానమే ఆధార ముగానుండినదిగనుక అజ్ఞానమే కూటస్థుడని, జీవుడని, ఈశ్వరుడని వుపాధివశముచేతభిన్నముగాను ఖండమువలెను పరిచ్ఛిన్నమువలె కనబడినను అజ్ఞానమైన బ్రహ్మమునకు దేహేంద్రియాదులను గు రించివచ్చు వుపాధులు లేక దేహేంద్రియాది కరణజీవునిమింగి అ తిక్రమించి అవయవము లేకనిరవయవముగానుండుటవలన ముందు పరోక్షముగా దెలుసుకొనబడిన సచ్చిదానంద స్వరూపమునుదాన ని అపరోక్షముగా దెలుసుకొన్నదే ఆగమప్రమాణ నిర్ణయము. ముందుచెప్పిన మూడుప్రమాణములచేతను వస్తునిశ్చయముకూడ దు. ఈప్రకారము యెప్పుడున్న సచ్చిదానందస్వరూపముగానుం డగా ముందు అజ్ఞానదశలో యీలక్షణము దెలియక పోయినదేమి యనవచ్చు బుద్ధివృద్ధిపరిహరించుకొరకు అర్థాపత్తిప్రమాణము వి చారించవలెను.

ప్రశ్న. అర్థాపత్తిప్రమాణమేది ?

ఉత్త. దృష్టార్థాపత్తియనిన్ని వినకడియర్థాపత్తియనిన్నీ రెండువిధములు యింటిలోనిత్య ఉపవాసియని పేరుపెట్టబడ్డ ఒకనిదేహాభిమానమును చూచి వీడు ఏకాంతములో భుజించువాడని తెలుసుకొనుటయే దృష్టార్థాపత్తి.

ప్రశ్న. ఇందులో స్వరూపాభిప్రాయమేది ?

ఉత్త. ముందుఅజ్ఞానదశలో సచ్చిదానందమని యెఱిగియు తన్ను దెలియ

పరుచుకొనక మరుగుపడ్డదే అర్థాపత్తిప్రమాణము. అందుసు న కల్ప్రాణులు అనుభవముగా నేను పూర్వజన్మములో జేయబడిన పుణ్యఫలముచేత నీజన్మములో మంచిజాతికులగోత్ర వర్ణదేహ రూపైశ్వర్యగృహాదులు మొదలైనసంపత్తులుగలిగినవనిన్ని యిపు డుచేయు పుణ్యకర్మములచేత నికముందుదేవమనుష్యులుగా జన్మిం చుదుననిన్ని ముందుజన్మములోయిచ్చి పెట్టని పాపిమైనందున యి ప్పుడు దరిద్రుడుగానున్నాననిన్ని యీజన్మములో నెవరికిన్ని దా నముచేయుటకు శక్తిలేదని దరిద్రుడుగానుండుటవలన యికముం దువచ్చుజన్మములో దరిద్రుడుగాజన్మించుదుననిన్ని యిట్టిసంవత్స రము, యిట్టినెల, యిట్టితిథి, నక్షత్రము, యోగము, కరణము, వా రము, లోజన్మించినాననిన్ని, యింతమట్టుకు సౌఖ్యము అనుభవిం చితిననిన్ని, యిక చెడ్డకష్టములు రాబోవుచున్నవనిన్ని, కష్టము నకు బిదప యీశరీరము నిలువదనిన్ని, యిట్లుత్రికాలములో గలి గిన హానివృద్ధి సుఖదుఃఖలాభాలాభముమానాభిమానములు తె లిసికొనియుండుటచేత దానుసచ్చిదానంద లక్షణముగానుండియు తెలియలేదనియనుటయేయజ్ఞానము. అదియే అజ్ఞానమైతే యి ది తెలియలేదను వివేకమువచ్చుటకు గారణములేదు. యిటువం టివివేకముతాననినయెడల తెలియవలసిన అజ్ఞానమువచ్చుట కారణ ములేదుగాన యీఅర్థాపత్తియేశుద్ధమైన తన్ను తెలిపించక యుం డుటబట్టి యీమతముచే ప్రధానమైన యజ్ఞానము. నిత్యోపవాసి యనువానియొక్క శరీరముశుష్కించకయుండుటనుబట్టి రహస్య ములోభుజించువాడని తెలుసుకొనుటవలె తానుసచ్చిదానంద ల క్షణము అనునది కనబడకయుండినను తనయనుభవముచేత దృ

ముగా విచారించి తెలుసుకొన్న యెడల తానే సచ్చిదానంద స్వరూపమౌను. ఇదియే దృష్టార్థాపత్తి. ఈలాగు సచ్చిదానంద స్వరూపమని యనుభవముగా దెలిసియుండియు ముందువలెనే నామరూపాదులు కనుబడుటచేతప్పు ఆలక్షణము యుండ లేకనబడదాయని వచ్చు బుద్ధివృత్తి పరిహరించుకొనుటకు వినకడియర్థాపత్తి ప్రమాణము విచారించవలెను.

ప్రశ్న. వినకడియర్థాపత్తి యేది?

ఉత్త. ఒకపురుషుడు ప్రక్కగ్రామములోనుండు ఒకనికి చూడవలెనని వచ్చి వాని యింటిద్వారమునందు నిల్చి యీగృహవాసి యున్నాడా యని యాగృహమందుండువారిని అడుగ అతడు లేడని చెప్పిన యభావశబ్దమువిని అతడు మరణము పొందలేదు గనుక అన్యస్థానమునకు పోయియుండునని తెలుసుకొన్నదే వినకడియర్థాపత్తి.

ప్రశ్న. ఇందును స్వరూపాభిప్రాయ మేది?

ఉత్త. నామరూపాత్మకములోను ఆత్మ లేదని తెలుసుకొన్న జ్ఞానము మాత్రము శేషముగానున్నదని కనుగొన్నదే లేదనిన వినకడియర్థాపత్తి ప్రయోజనము. జ్ఞానమే రూపముగానుండు ఆత్మనైతే తెలుసుకొనబడిన పదార్థమును గురించి జ్ఞానమని పేరు ఉండుటవలన తెలుసుకొనబడిన వస్తువులైన జీవేశ్వరజగత్తునకు కారణమైన మాయయును అనాదిగానుండవలెను. అప్పుడు వాట్లకు నిత్యత్వము వచ్చునేయను బుద్ధివృత్తి పరిహరించుకొనుటకు అభావప్రమాణము విచారించవలెను.

ప్రశ్న. అభావప్రమాణమేది?

ఉత్త. ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అన్యోన్యాభావము, అత్యంతాభావము అని నాలుగు విధములు.

ప్రశ్న. వీటిలో ప్రాగ్భావమేది ?

ఉత్త. కులాలుడు చక్రములోనుంచు మృత్తికాపిండమునుచూచి దీనిలో ఘటములేదనుట ప్రాగ్భావము.

ప్రశ్న. దీనికిస్వరూపాభిప్రాయమేది ?

ఉత్త. ఘటములేదనిన యభావమునకు అనాదిత్వం అనంతకల్పములుగానుండియు నిత్యత్వంసిద్ధించలేదు. యేలాగనిన ? కులాలుడు చక్రమునుచుట్టి మృత్తికాపిండములో చెయిపెట్టినపుడు ముందు లేనిఘటము యుత్పత్తియైనది. గనుక ముందులేదనిన అభావమునకు అనాదిత్వముయుండియు అనిత్యత్వంసిద్ధించినది. దానివలెమాయయు దానికార్యమైన జీవేశ్వరజగత్తున్ను అనాదిత్వమని కొన్ని శాస్త్రములలోజెప్పబడియుండినను విచారజ్ఞానమైన వృత్తిజ్ఞానముచేత దహింపబడి అనిత్యమౌననుటయే ప్రాగ్భావప్రయోజనములయినది. వృత్తిలో ప్రతిఫలించువృత్తిజ్ఞానముచేత దహింపబడ్డ మాయయు దానికార్యమైన జీవేశ్వరజగత్తు వృత్తిజ్ఞానములేనియెడల ముందువలె ప్రత్యక్షముగా గనబడునేయను బుద్ధివృత్తిపరిహరించుకొనుటకు ప్రధ్వంసాభావమును విచారించవలెను.

ప్రశ్న. ప్రధ్వంసాభావముయేది ?

ఉత్త. ఒకదరిద్రుడైన భిక్షుకుడు ఒకఘటమే ఆసక్తిగాగొని పాపవశముచేత ఇల్లిల్లు భిక్షమెత్తి భుజించుకాలమందు ఆయిండ్లలోనుండు బాలురు అజ్ఞానక్రీడోత్సాహముచేత రాళ్లువువ్వ, ఆభిక్షుకుడుఘటవాంఛచేత నారాళ్లదెబ్బలంతయు తనశరీరమును ఆపుచేసుకొని సహించజాలక వానికే విరక్తిగలిగి ఆఘటమును వకబండమీదవేయ నాఘటముపగిలిపెంకులై చెదరిపోయెను. పిదపఘటవాంఛ

చేత పొడుపొర్లిపొర్లియేడ్చినను పగిలిన ఘటము రాచాలదనేదే ప్రధ్వంసాభావము.

ప్రశ్న. దీనికి స్వరూపాభిప్రాయమేది ?

ఉత్త. ముందువిచారజ్ఞానముచేత దహింపబడ్డమాయయు దానికార్యమైన జీవేశ్వరజగత్తున్ను పిదప కల్పకాలములోనుకలుగనేరదని తెలుసుకొనుటయే అభిప్రాయము. ఘటముపగిలియు దానికార్యముమరుగుపడి కారణముకాకుండాఘటము పెంకనికార్యోపాధి కనబడునటువలె వృత్తిజ్ఞానముచేత నసించినమాయయు దానికార్యమైన జీవేశ్వరజగత్తున్ను కారణమైనబ్రహ్మమాత్రముగానగనబడక మాయాకార్యమైన జీవేశ్వరజగత్తని వివేకములోగనబడియుండుటను తెలుసుకొనబడి యుండుటచేత నామాయయు వస్తుద్వయముగానుండునుగనుక బ్రహ్మములో మాయయున్నది. మాయలోబ్రహ్మమున్నదనుబుద్ధివృత్తి పరిహరించుకొనుటకు అన్యోన్యభావము విచారించవలెను.

ప్రశ్న. అన్యోన్యభావమేది ?

ఉత్త. పటములోఘటము, ఘటములోపటము, కాలత్రయములో లేదని తెలుసుకొనుటయే అన్యోన్యభావము.

ప్రశ్న. దీనికి స్వరూపాభిప్రాయమేది ?

ఉత్త. అద్వైతము, అవినాశము, ఉపమానరహితము, అవాఙ్మానసగోచరము, మానాతీతము, అస్తిభాతిప్రియలక్షణము అయిన ఈగుణములుంకలిగినదియే బ్రహ్మస్వరూపము. ద్వైతము, దృశ్యము, మనోవాక్కు, గోచరము, అనిర్వచనము అయినయాగుణములు కలదియేమాయాస్వరూపము. ఆమాయా స్వరూపములోబ్రహ్మ

స్వరూపము లేదు. బ్రహ్మ స్వరూపములో మాయా స్వరూపము లేదని తెలుసుకొను దృఢమువచ్చినదే యభిప్రాయము. ఇది నామరూపమని మాయయనిమనస్సులోగనబడుచున్నది. ఆమాయ లేనియడలమనస్సునందు అగపడదు. గనుక మాయయున్నదనురాబడుబుద్ధివృత్తి పరిహరించుకొరకు అత్యంతభావము విచారించవలెను.

ప్రశ్న. అత్యంతభావమేది?

ఉత్త. ఒకపురుషుడు దనస్వప్నములో దానుచచ్చుటయు తన్ను దహనముచేయుటయు మరుసటిదినము అస్తులు యెత్తి కుంభములోవేసి గంగలోవిడుచుటయు కని మేల్కొని జాగ్రతలోమనస్సులోదలచి వాక్కులోజెప్పవచ్చియు నిశ్చయముగాక మిథ్యయని తెలుసుకొనుటయే అత్యంతభావము.

ప్రశ్న. దీనికి స్వరూపాభిప్రాయమేది?

ఉత్త. మాయయనియు, జీవేశ్వరులనియు, నామరూపములుగా జెప్పినను తలచినను వట్టిమిథ్యయేలాగనిన ఆకాశములోదామరవికసించినదని మనస్సులోగనేనేని అదియేలాగు లేదో దానివలె మాయయని మనస్సులోవచ్చినేని కాలత్రయములోను లేదని ధృఢము వచ్చినదే యభిప్రాయము. మాయయనునది కాలత్రయములో లేకయుండియు సకలదేహులను నానావిధములుగాను ప్రసిద్ధముగానుండుటవలె తోచుటకుకారణమేదను రాబడుబుద్ధివృత్తిపరిహరించుకొఱకు ఐతీకప్రమాణము విచారించవలెను.

ప్రశ్న. ఐతీకప్రమాణమేది?

ఉత్త. ఒకడు ఒకవటవృక్షముపైనెక్కి పత్రములు కాష్టములు కావలసి

నంతమట్టుకు యేర్పరుచుకొని క్రిందికి దిగుసమయములో వేరొక డువచ్చి యెవరురా పైత్యకాడా! యీచెట్టులో మహాయక్షుడను పిశాచియున్న దే దీనివద్ద ఒకడున్ను చేరడము లేదే, నీవుదీనిపైకా లుపెట్టి యెక్కనచ్చునాయను శబ్దమును విన్నతోడనే మనస్సు లోభయము శరీరకంపముకలిగి విరిచినకట్టలను యేర్పరచిన ఆసు లనుపారవేసి చెట్టునుండి దిగకాళ్లుతొట్రుపడిక్రిందపడి మూర్ఛఅయి నదే ఐతిహ్యప్రమాణము.

ప్రశ్న. దీనికి స్వరూపాభిప్రాయమేది ?

ఉత్త. మాయయుమాయాకార్యములు కాలత్రయములోలేవి వట్టిమిథ్య యైనను ప్రత్యక్షముగాచూడనియక్షువిషయము అన్యాపు చెప్పిన మాటవిన్నతోడనే వున్నదని సత్యబుద్ధివచ్చునటువలె ఆమాయా కార్యమైన జీవేశ్వరజగత్తులు ప్రసిద్ధముగానుండుటవలె అసంధాన మైన భ్రాంతిమూలభ్రమచేత నగబడునని కనుగొనుటయే యభి ప్రాయము మాయయనునది లేనియడల మాయ కార్యమైన నామరూపజగత్తనియు శబ్దస్పర్శరూపరసగంధకరణమునియు అనే కవిపరీతము అగపడుటకుకారణమేమనురా బుద్ధివృత్తిపరిహరించు కొరకు సంభవప్రమాణము విచారించవలెను.

ప్రశ్న. సంభవ ప్రమాణమనునదియేది ?

ఉత్త. వేయియనులెఖలోఒకటి, రెండు, ఐదు, పది, నూరు, యనులెఖలు వున్నవని తెలుసుకొనుటయే సంభవప్రమాణము.

ప్రశ్న. దీనికి స్వరూపాభిప్రాయమేది ?

ఉత్త. శబ్దమని తెలుసుకొన్నప్పుడు అజ్ఞానమేశబ్దరూపముగానుండుటచేతప్ప స్పర్శరూపరసగంధకరణదేహములులేవు. స్పర్శమని తెలుసు కొన్న

ప్పుడు అజ్ఞానమే స్పర్శరూపముగానుండు నేతప్ప శబ్దరూపరసగంధ కరణదేహములు లేవు. రూపమని తెలుసుకొన్నప్పుడు అజ్ఞానమే రూపముగానుండు నేతప్ప శబ్దస్పర్శరూపగంధకరణదేహములు లేవు. రసమని తెలుసుకొన్నపుడు అజ్ఞానమే రసరూపముగా నుండు నేత ప్ప శబ్దస్పర్శరూపగంధకరణదేహములు లేవు. గనుక యింద్రియసహితమై శబ్దస్పర్శరూపరసగంధములుగా కనబడినదంతయు అజ్ఞానమైన బ్రహ్మమే అది, యిదిగా కనబడినది. గనుక జ్ఞానమైన బ్రహ్మములోననేకములువలె జ్ఞానమైనతన కేయగపడును. ఇదిగాక సర్వశక్తిగలవాడౌటచేత ననేకములుండవచ్చును. అట్లుండుటచేత సర్వాధారభూతమైన నిరుపాధిక బ్రహ్మమే యున్నదని తెలుసుకొనుటయే యభిప్రాయము. ఇది యేఅపూర్వత.

ప్రశ్న. ఫలమనునది యేది ?

ఉత్త. ఈజగద్వస్తువులో నొకవస్తువును తెలుసుకొన్నమాత్రమే సకలము ఈప్రకారమే యుండునని తెలుసుకొనుటవలె ఆత్మజ్ఞానము తెలుసుకొన్నమాత్రమే సకల బ్రహాండ పిండములోను తానుగాప్రకాసించు బ్రహ్మమేతానని తామేఆత్మస్వరూపముగా ప్రకాసించుటనియు ఈదేహేంద్రియాది సకలజగత్తు ప్రారబ్ధముండువరకు మిథ్యముగా నగపడుచున్నదనియు ప్రారబ్ధ నాశములో సర్వాత్మకముగా గనుబడక అద్వైతాత్మస్వరూప మాత్రముగా ప్రగాసించునని ప్రతిపాధించబడుటయేఫలము.

ప్రశ్న. అర్థవాదమేమి ?

ఉత్త. ఏవస్తువును విన్నమాత్రములో వినబడనివస్తువు వినబడుటయు, ఏ వస్తువుమననము చేసినమాత్రములో మననము చేయబడనివస్తువు

మననము చేయబడుటయు, ఏవస్తువును తెలుసుకొన్న మాత్రము లో తెలుసుకొనబడనివస్తువు తెలుసుకొనబడుటయు అదియేపం చకృత్యములకు ఆధారభూతమైన కర్తృత్వముగా ప్రకాసించునని ప్రతిపాదించుటయే అర్థవాదము.

ప్రశ్న. ఉపపత్తియనగానేది?

ఉత్త. ఘటమునకున్ను తంతువునకు పటమున్ను ఆయుధమునకు యినుమున్ను కారణమగునటువలె నగపడునామరూప జగములకు బ్రహ్మమే కారణమని జగమునకున్ను బ్రహ్మమునకున్ను, అభిన్నత్వ ప్రతిపాదించుటయే ఉపపత్తి. ఈఅష్ట ప్రమాణషడ్లింగ తాత్పర్యములకు సద్గురువలన శాస్త్రములను వినబడుటయే శ్రవణము.

ప్రశ్న. మననమనునదియేది?

ఉత్త. వేదాంతశాస్త్రములచేత శ్రవణముచేసి నద్వైతమైన ప్రత్యగాత్మస్వరూపమును అనుకూలమైన బుద్ధివృత్తిచేత యూహించినిశ్చయించుటయేమననము.

ప్రశ్న. నిదిధ్యాసమునేది?

ఉత్త. విజాతీయమైన దేహేంద్రియాదులును స్వజాతీయమైన యఖండాకారవృత్తితో జేర్చి కొండసిఖరమునందు విడిచిన తైలధారలవలె నెడతెగక అఖండాకారవృత్తి చేతసదాధ్యానించినిల్చుటయే నిదిధ్యాసము. ఈలాగుషడ్లింగ తాత్పర్యముతో వినబడిన శ్రవణములో మెవనికియెంతవరకు అజ్ఞానబుద్ధితొలగలేదో అంతవఱకున్ను శ్రవణముచేయవలయును. ఇట్లు శ్రవణముచేసి నిశ్చయము చేసిన వస్తువుతో నెంతవరకు సంశయబుద్ధి తొలగలేదో అంతవరియుంతము యుక్తితర్కానుమానసహాయములచేత మననము చేయవ

లయును. ఈప్రకారము మననముచేసి దృఢమైన వివేకములో నెం తవరకు నేను నాదియని విపరీతబుద్ధి తొలగలేదో అంతవరకు మంత్రయోగము మొదలగు అయిదువిధములయిన యోగాభ్యాస సహాయములచేత నిధిధ్యాసము చేయవలెను.

ప్రశ్న. అది యేది ?

ఉత్త. అపరోక్షసాక్షాత్కారశ్రవణములో కుతర్కములతో జేరి దృశ్యమైనది. ఎంతకాలమూ నాశము పొందలేదో అంతకాలము అజ్ఞానముపోచాలదుగనుక మోక్షాపేక్షగలవాడు ధ్యానసమాధులనవశ్యము చేయవలయును.

ప్రశ్న. అధ్యానసమాధులు యెన్నివిధములు ?

ఉత్త. సవికల్పసమాధి, నిర్వికల్పసమాధియని రెండువిధములు.

ప్రశ్న. సవికల్పసమాధి యేది ?

ఉత్త. జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయమన్నిత్రిపుటివున్నవి; వాటిలో దేహమే తాను అనునది అశుద్ధజ్ఞాతృ తెలివియే; తాననునది శుద్ధజ్ఞాతృ. ఈజ్ఞాతృవే జ్ఞానములోజేరి జ్ఞానేంద్రియములగుండా యిచ్ఛ అయిచ్ఛయని తెలుసుకొనడము అశుద్ధజ్ఞానము; యింద్రియములద్వారా తెలుసుకొను తెలివియైన అశుద్ధజ్ఞానమును, అబద్ధ తెలివియని తెలుసుకొనడమేనిశ్చయమైన జ్ఞానతుర్యమే శుద్ధజ్ఞానము. భూతములయినిది చేరి భౌతికములై యెదురుగా శబ్దాదివిషయములుగా గనబడుట అశుద్ధజ్ఞేయము. ఈశబ్దాది విషయములన్నియు స్వరూపమాత్రముగా జూచుటయే శుద్ధ జ్ఞేయముగనుక ఈయశుద్ధత్రిపుటిలనులయముచేసి శుద్ధత్రిపుటిలకులయము రాకుండునట్లు జ్ఞేయముగానుండక కేవలపరబ్రహ్మవస్తువుయందు మనస్సునునిలిపితాను బ్రహ్మాకారముగానుండుటయే సవికల్పసమాధి.

ప్రశ్న. అది యేలాగు ?

ఉత్త. మట్టిచేత చేయబడిన భాండము మన్నుగానుండియు చూచువారికం డ్లకు భాండమని యేలాగు అగుపడుచున్నదో అటువలె జ్ఞాతృజ్ఞానజ్ఞేయములయిన శుద్ధత్రిపుటియైన మనస్సును సత్తైన చిన్మాత్ర బ్రహ్మమునందు చిన్మాత్రముగా ప్రకాశించుటవలన సవికల్పసమాధియని పెద్దలు చెప్పుచుందురు.

ప్రశ్న. నిర్వికల్పసమాధి యేది ?

ఉత్త. జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములైన శుద్ధత్రిపుటిలను మనోవాసనలువదలి జ్ఞేయమాత్రమయిన పరబ్రహ్మస్వరూపము తానైనదే నిర్వికల్ప సమాధి ?

ప్రశ్న. అది యేలాగు ?

ఉత్త. నీరులోకరిగినవుప్పు వుప్పని వేరుగాక నీళ్లవలెయుండునట్లు బ్రహ్మాకారమైన మనస్సు బ్రహ్మమాత్రముగానిల్చి త్రిపుటిమొదలైనసంకల్పవికల్పములులేక సత్తామాత్రమైన బ్రహ్మస్వరూపముగా ప్రకాశించుటవలన నిర్వికల్పసమాధియని పెద్దలు చెప్పుదురు. ఈ రెండువిధములయిన సమాధులలో మనోభేదముండుటవలన సమాధిసుషుప్తిలో యీరెంటిలో మనోనాశముసమముగా లేనందున సుషుప్తిలో అజ్ఞానముగనపడుటవలనను సమాధిలో నజ్ఞానము అగపడకయుండుటవలనను అజ్ఞానము, అజ్ఞానకార్యమైన సందేహావిపరీతము తొలగి బ్రహ్మజ్ఞానమునకు ఒక విఘ్నములేక సదా స్వరూపానందముకలుగు కొఱకు మోక్షదాహిఅయినవాడు. బహిరంతరములనెడు భేదముచేత నారువిధములుగానుండబడు షడ్విధ సమాధులను అవశ్యము అభ్యాసముచేయవలయును.

ప్రశ్న. షడ్విధసమాధు లేవి?

ఉత్త. అంతర్దృశ్యానువిత్తం, అంతసప్తానువిత్తం, అంతర్నిర్వికల్పము, బాహ్యదృశ్యానువిత్తం, బాహ్యసప్తానువిత్తం, బాహ్యనిర్వికల్పము అని యాఱువిధములు.

ప్రశ్న. అంతదృశ్యానువిత్తమేది?

ఉత్త. తెలివికానేదృశ్యములైన కామక్రోధాదివృత్తులలోఁగూడి వాటికి సాక్షిగానుండి స్వరూపసంధానము చేయుటయే అంతర్దృశ్యానువిత్తము. మఱియు నేను నాకు ఇది యనెడు ఈకామక్రోధాదివృత్తులను ఏ తెలివిలో దెలుసుకొన బడుచున్నదో ఆద్రష్టరూపమైన తెలివికి అహంకారము మొదలయిన కామాదులే దృశ్యములు. ఈకామాదులవృత్తులను అధికారిగాజూచు సాక్షియైన తన్నుచూచున్నట్టివాడు నిష్క్రియుడుగానేయుండును. ఈకామాది వృత్తులకంతయు నేనుసాక్షి నావల్ల ఈవృత్తులు అగుపడుచున్నవని తన్ను సాక్షిగాజూచినవాడే సాక్షిగానుండుగనుక దృశ్యముగా నుండుదేహాదిజగత్తును ఆత్మగానుండుతనవద్దలయము చేయవలయును.

ప్రశ్న. లయముచేయుట యెటువలెను?

ఉత్త. నేనుదేహము, ప్రాణాదివాయువులు అహంకారము, మనస్సు, బుద్ధి, చిత్తము, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు యివి అంతయుకాను. వీట్లకంతయు సాక్షిగాను నిత్యముగానుయుండు ప్రత్యేగాత్మస్వరూపమే నేను. నేను స్థూలము, సూక్ష్మము, పెరిగినవాడను, వృద్ధుడను, మూగివాడను, కుంటివాడను, ముక్కుపోయినవాడను, వచ్చినవాడను, పోయినవాడను, చంపినవాడను, చంపబడని వాడను, కర్తయును, భోక్తయును, చెప్పువాడను, చెప్పబడువాడను

సుఖియును, దుఃఖియును, యోగియును, నియోగియును, రోగియును, విరాగియును, కామియును, క్రోధుడను, లోభియును, బధుడను, ముక్తుడనుకాదు. వీట్లకంతయుసాక్షిగాను, నిత్యముగానుండు ప్రత్యగాత్మస్వరూపమే నేను. నేనుఅంతఃప్రజ్ఞయును, బహిఃప్రజ్ఞయునుకాదు. తెలుసుకొనబడువాడను, తెలుసుకొనబడనివాడనుకాదు. ఈదేహేంద్రియాదులయొక్క చెరికెసంబంధములేదు. పుణ్యపాపములునాకులేవు. ఆకలిదప్పియు మొదలైనషడ్రసములకు దూరముగా సదావిముక్తమైన కేవలచిద్రూపమే నేననితనస్వరూపమును తానే తెలుసుకొని అగబడు దృశ్యములంతయుతనలోలయముచేస్తూయుండవలెను. భ్రాంతివల్ల అగపడువిపరీత భావములను వివేకివదలియుండును

ప్రశ్న. అది యేలాగు?

ఉత్త. జగద్విపరీతభావమువదలి స్వయంప్రకాశమైన ఆత్మస్వరూపమైనదే ముక్తియని శ్రుతిస్మృతిచెప్పుటవలన సహామనస్సును నిలుపువానికే ఈసమాధిసిద్ధించును. లేనియెడల సిద్ధించదుగనుక సదామనస్సునునిలుపవలయును. యిదియుతప్ప వకవేషముతోడను భాషతోడను ఈ అఖండసచ్చిదానందానుభవము సిద్ధించదు. ఇది సిద్ధించుకొరకు అస్తిభాతిప్రియమైన తనయందు అహంకారాదులను వానివికారములను లయముచేయవలయును. ఎవడు ఆత్మతత్వమును అపేక్షించి ప్రకృతినినాశముచేయుచున్నాడో వాడేముక్తుడు. యిదియునుగాక, కోటిసత్కర్మములుచేసినను ముక్తుడుకాచాలడని యజుర్వేదములోను శతాశ్వతరోప నిషత్తులో జెప్పబడియున్నది; మరియు స్వయంప్రకాశమైనయాత్మను తెలుసుకొన్న

వాడు సకలజ్ఞానభావనలు మఱచి జననమరణసంసారమైన క్లేశము లనుంచివిముక్తుడగునని సకల వేదాంతశాస్త్రములును చెప్పుట వలన సకలక్లేశములనువిడిచితొలగుటయే జన్మముతొలగును. అట్టి స్థితియే జన్మరహితమైనముక్తి.

ప్రశ్న. సకలక్లేశములను దొలగించువిధమెట్లు?

ఉత్త. ఆత్మనిష్టచేత దొలగించవలయునుగనుక మోక్షాపేక్షగలవాడు సదాకాలమునిష్ఠచేయవలయును. జన్మవాసనతప్ప పురుషునికి వేరే విరోధులులేరుగనుక సకలవాసనలను సమాధినిష్టమైన జ్ఞానాగ్ని చేతదహించినట్లైతే మళ్లిజన్మమునకు హేతువుకాదు.

ప్రశ్న. అదియేలాగు?

ఉత్త. అగ్నివలన వేపబడిన విత్తులుమొలచుటకుహేతువుకానటుల జ్ఞానాగ్నిచేత దహింపబడ్డ వాసనారూపమైన క్లేశములుమరుజన్మమునకుహేతువుకానేరదు. గనుక ముముక్షులు ఆశేషవాసనాక్షయము విపరీతభావనివర్తియుకలుగుటకొరకుప్రయత్నముచేసి మైనను సదాజ్ఞానసమాధులనభ్యసించవలయును. ఇటువంటి జ్ఞాననిష్ఠగలవానికి కర్మములవశ్యములేదు. కర్మమునకు జ్ఞాననిష్ఠకుయేకమైనకూటమిసిద్ధింపదు.

ప్రశ్న. అది యేలాగు?

ఉత్త. దేహాత్మ బుద్ధితోగూడిన కర్తృత్వభావనయిచ్చునదికర్మము. ఆకర్తృత్వభావనను చెడుపునది జ్ఞానముగనుక ఒకటికొకటివిరోధమైన జ్ఞానకర్మలకు యెట్లుఐక్యమునుబొందును. తేజస్సుకు తిమిరమునకు యెట్లుసంబంధములేదో పశ్చిమముఖముగా జూచువానికిన్ని యెట్లు ఒకరినొకరు చూచుకొనుటకు సంబంధములేదో

ఇలాగే అంతర్ముఖ దృష్టిగలిగిన జ్ఞాననిష్ఠాపరునకు బాహ్యకర్మము లకున్ను సంబంధము లేదు. గనుక నిష్ఠాపరుడుగా నుండువానికి కర్మతంత్రవనములలో నవకాశము లేదు.

ప్రశ్న. మఱియు దేనివలననుండును ?

ఉత్త. త్రికరణములచేత మనోవాక్కాయము సాధించబడుకర్మములం తయు అసత్తగుటవలన సర్వమిథ్యయేయని సకలదృశ్యములను వదలి దృక్కైనసచిత్స్వరూపములో నిల్చియుండుటవలన ఆస్థితియే సంధ్యావందనము, అనుష్టానము, వ్రతము, రమించడము, గనుక కేవల సత్యమైన పరమార్థమునుబొందియుండు సత్పురుషులకు స కలముజ్ఞాననిష్టతప్ప వేఱులేదు. సకలమునుత్యజించి జ్ఞాననిష్ఠాప రులుగానుండు సన్యాసులకు వేఱే క్రియాసాధనములు వకటిన్ని లేదు. గనుక క్రియాంతరంగములైన పనులనంతయువదలి నిష్ఠాపరుడుగా నేయుండవలెను. జ్ఞానమేడనెక్కవలెనని యపేక్షించియుండుము ముక్షువు ఆత్మనిష్టమైన కర్మముచేసికొని చంచలరహితుడుగా స దా ఆత్మసాక్షాత్కారుడుగా ఆత్మస్వరూపములోనిల్చియుండవలెను. జ్ఞానమేడనెక్కుటకు అపేక్షగల అభ్యాసికిజ్ఞాననిష్ఠాసాధనములే క ర్మములు. యోగమేడలో నెక్కు ను ముముక్షువుకు యోగముతప్ప వేఱుక్రియాంతరంగములు తమాత్రము లేవు. ఒకడు యోగిగా నుండి వేఱుక్రియాంతరంగములను తలచినేని చెట్టుపై నెక్కితప్పిక్రింద పడువానివలె అధోగతిలోపడిపోవును. జ్ఞానమేడనెక్కియుండు కృతకృత్యుడైన వివేకికి బాహ్యమందుచేయుకార్యములు యేమి యు లేవు. ఇదియే అంతర్దృశ్యానువిద్ధ సవికల్పసమాధి.

ప్రశ్న. అంతరస్థానువిద్ధము యేది ?

ఉత్త. కేవలచిన్మాత్రముగా చేష్టించబడ్డ శబ్దముతోగూడి తాను అసంగుడు, స్వయంప్రకాశుడు, అద్వైతుడు అనుశబ్దములుకలిగి అర్థములు తానని భావించినభావనయేదియో అదియే అంతర్ సన్మానువిత్తము.

ప్రశ్న. ఇందుకు అనుభవము ఎటువలె?

ఉత్త. నేనుశుద్ధుడను, శాంతుడను, అనంతుడను, ముందువెనక తొడవు లేనివాడను, బహిరంతరములయందునిండినపరిపూర్ణుడను, ఆనందుడుగానుండువాడను, జననమరణములులేనివాడను, నిత్యానందమైన అద్వైతుడనని ప్రత్యేకాభిన్నమనియు, అఖండమనియు, సచ్చిదానందలక్షణమనియు, శుద్ధమనియు స్మృతులలో చెప్పబడు పరంజ్యోతియైన బ్రహ్మముయేదియో అదియేనేననియనెడి సత్తామాత్రముగానుండు వృత్తితోగూడి సత్తాసామాన్యమైన శబ్దమును బొంది చంచలములేక, సమాదిదృశ్యములను స్వరూపములో లయముచేసి శుద్ధోహం మొదలయిన శబ్దములతోడ దృశ్యప్రధానమైన భావనగా సాధించవలెను. ఇదియే అంతసన్మానువిత్త సవికల్పసమాధి.

ప్రశ్న. అంతర్నిర్వికల్పమనునదియేది?

ఉత్త. దృశ్యానువిత్తము, సన్మానువిత్తము, ఈరెండునువదలి మనోవ్యాపారములనుబొత్తిగావిడిచి పెట్టుటయే అంతర్నిర్వికల్పము. ఎవడొకడుముందుచెప్పిన సవికల్పసమాధిని భక్తితోనెడతెగక బహుకాలము అభ్యాసముచేయుచున్నాడో, వానికివాసనాక్షయము చిత్త, లయము, భంగములేనినిరతిశయానందము సిద్ధించును. ఈ లక్షణముగలయోగియైనవాడు బహిరంతరము... చూడక అంత

దామృత సముద్రములో మునిగినవాడై తానుతప్పఅన్యములే దని వుండునుగనుక నిర్వికల్పమైనపరబ్రహ్మస్వరూప నిష్ఠగలవార లేజీవన్ముక్తులు. వారలే జీవస్వభావముగలిగియుండియు కలగనిన వారలని తెలుసుకొనవలెను. ఒకడు ఈమూడువిధములైన సమాధులను అంతర్ముఖమందు అభ్యసించినటువలె బహిర్ముఖములో ద్వివిధనివర్తికలుగుటకుగాను బాహ్యాదృశ్యానువిద్ధము, సత్తాను విద్ధము, నిర్వికల్పమను మూడువిధ సమాధులను అభ్యసించ వలెను.

ప్రశ్న. బాహ్యాదృశ్యానువిద్ధమేది ?

ఉత్త. అధిష్ఠానముగా సచ్చిదానందమైన పరబ్రహ్మవస్తువులో గల్పిత మైన నామరూపాదిజగత్తు ప్రకాశించుచున్నది. ఏలాగనిన ? శీ తలము, తెలుపు, మృదుత్వము, నురుగులు, తుంపురులు, అనుపే రువకటిగా జేరిన జలమును అలలనునటువలె సచ్చిదానంద నామ రూపములు అయిదు వకటిగాకూడిన స్వరూపమును ప్రపంచమని జెప్పబడుచున్నది. ఆరోపితములైన నామరూపములు రెండును త్యజించి యధిష్ఠానమైన సచ్చిదానంద స్వరూపమాత్రముగా జూ చుటయే బాహ్యాదృశ్యానువిద్ధము. మఱియు సచ్చిదానంద బ్రహ్మముతప్ప నామరూపములులేదనియు నామరూపములను వే రుపరచి యధిష్ఠానస్వరూమునందు ఆరోపితములను లయముచేసి అద్వైతవస్తువేతానని సదాభజనచేయవలయును.

ప్రశ్న. ఇందుకు అనుభవమువెట్లు ?

ఉత్త. ఈపంచభూతములు పంచభూతకార్యములునేనుకాదు వీటికంతయు, అధిష్ఠానముగాను, విశుద్ధముగాను, సత్తామాత్రముగానుండు బ్ర

హ్మము యేదియో అదియే నేను. అగపడుపదార్థములు, గుణము లు, క్రియలు, జాతియు, శబ్దాదిపంచవిషయములు, ఇంద్రియము లు, ప్రాణము, మనస్సు, బుద్ధియు, అహంకారాదులు నేను కాదు, వీటికంతయు యధిష్ఠానముగాను, ఏకముగాను, విశుద్ధముగాను, సత్తుగాను, పరమాత్మగానుండు బ్రహ్మమే నేను; దృశ్యమైన నామ రూపములంతయు మిథ్య. ఇందుకు అధిష్ఠానమైన బ్రహ్మమే సదా స త్యమని భావించి నడచునపుడు, ఉండునపుడు, సదా ధ్యానించుచుం డవలెను. ఇదియే బాహ్యదృశ్యానువిద్ధసవికల్పసమాధి.

ప్రశ్న. బాహ్యశబ్దానువిద్ధమనునదియేది?

ఉత్త. అధిష్ఠాన సచ్చిదానందములో కల్పితమైన నామరూపములను ల యము చేసి నిర్మలముగాను అద్వైతముగాను బ్రహ్మానందముగాను ఉం డు బ్రహ్మమే నేనని భావనపొంది నిల్చుటయే బాహ్యశబ్దాను విద్ధము.

ప్రశ్న. ఇందుకు అనుభవము యేలాగు?

ఉత్త. నిర్వికారముగాను, నిరాకారముగాను, నిరంజనముగాను, అనామయ ముగాను, ఆద్యంతరహితముగాను, సత్యముగాను, శుద్ధముగాను, బుద్ధముగాను, శుద్ధచిత్తముగాను, పరముగాను, ప్రత్యేకాత్మగా ను, అఖండముగాను, స్వప్రకాశముగాను, చిదాకాశముగాను, అ త్యంతసూక్ష్మముగాను, నిర్వికల్పముగాను, కేవలముగాను, పర మాత్మగానుండు బ్రహ్మమే నేను. ఇందుకు సందేహము లేదని ని ర్వికారాది మొదలగు శబ్దములతో జేరి కేవలమైన వస్తులక్ష్యములో మనస్సు నిల్పి ధ్యానము చేయవలయును. ఇదియే బాహ్యశబ్దాను విద్ధసవికల్పసమాధి.

ప్రశ్న. బాహ్యనిర్వికల్ప సమాధి యేది?

ఉత్తర. బ్రహ్మానందపరవశము చేత స్వరూపముతో నేకముగాజేసి బాహ్యమందు సకలక్రియలువదలి నిశ్చలముగానుండుటయే బాహ్య నిర్వికల్పము. ఇటువంటియోగి లేచునప్పుడును, ఉండునపుడును, మఱియెక్కడ యింద్రియనిగ్రహుడై సావధానముగా ఈసమాధులు ఆరును చేయవలయును.

ప్రశ్న. ఎంతకాలము చేయవలయును?

ఉత్తర. ఎంతకాలము విపరీతభావన తొలగలేదో అంతకాలము చేయవలయును. మఱియు మోక్షద్వ్యాహిఅయినవాడు అంతర్బాహ్యమైన షడ్విధసమాధులను ఏకాలమును మఱచియుండకూడదు. మఱి చెనేసి సూర్యుడు లేనిచోట తిమిరముకప్పునటువలె స్వరూపమైన తత్ప్రకాశమును మాయయనుతిమిరము కప్పుకొనునుగనుక భంగములేని స్వరూపానుభవ ప్రకాశమైనది యెంతకాలము సిద్ధించలేదో అంతకాలము ఈఆరువిధసమాధులందు నిరంతరము కాలము గడుపవలయును. పెద్దలైనవారు స్వానుభవమును విడిచి క్షణమైన తొలగియుండుటలేదు. స్వానుభవమును మఱచియుండుటయే మృత్యువు. ఇదితప్ప వేరే మృత్యువులేదు. అని శ్రుతిస్మృతులలో చెప్పుచున్నదిగనుక ఈఆరువిధ సమాధులను ఎవడు అభ్యసించునో వానిమనస్సులో నొకవికల్పము తోచదు. ఈయభ్యాసము చేతసర్వాత్మ భావముసిద్ధించును. యిదియే కైవల్యము. సర్వాత్మభావము పొందినదే బ్రహ్మవిద్యాఫలమని పెద్దలు చెప్పుదురు. జీవన్ముక్తునికి సకలముతానుగానుండు ఆనందానుభవమే ప్రయోజనము; నేను, వాడు, యిదిఅను మొదలైనవి అసత్తును గ్రహించుచు

యేహృదయ గ్రంథియైనదిసమాధిలో వాసనతోనసించి పోయిన ట్లయితే బ్రహ్మమేతానుగానుండు స్వానుభవము భంగములేక ప్రకాసించును. అదియేమోక్షమునకు నేదైనమార్గ మనిపెద్దలుచెప్పుదురు. ఇదిశుద్ధాంతఃకరణములుగానుండు వారికి సదాకాలము అగపడును. ఇతరులకుఅగపడదు. గనుకమరుపులేక సదాకాలము ఆరువిధసమాధులను చక్కగానభ్యసించి హృదయగ్రంథిని జ్ఞానాగ్నిచేతదహించి నిరంతరముబ్రహ్మానందామృతసముద్రములోము ణిగితనుకొనుచు సంతోషకరముగా వృత్తిసంచలములేక తథాకారముగానుండుటయే నిర్వికల్పసమాధి. ఈనిర్వికల్పసమాధిలో నుండునతడే గుణత్రయములనుదాటినవాడు. ఇదిలేనివాడుయోగిగానుండినను గుణత్రయవశుడుగాసంసారములో చుట్టితిరుగువాడు.

ప్రశ్న. గుణత్రయములను దాటుటయెట్లు?

ఉత్త. నేత్రము, కంఠము, హృదయమైన జాగ్రస్వప్నసుషుప్తియైనఅవస్థాత్రయపిలకుణుడుగానుండుటయిట్లు గుణాతీతమయినసుఖసమాధియైనదిజీవన్ముక్తునికేసిద్ధించును, మరియొవరికిన్ని సిద్ధింపదు. అసత్తైయినవిషయములనుఅనుసంధానముచేయువాడుబంధుడనియు,సత్తుగానుండువస్తు స్వరూపానుసంధానముచేయువాడు ముక్తుడనియు,శ్రుతులుచెప్పుచున్నవి. గనుక మోక్షాపేక్షగలవాడు ప్రయాసపడియైన సదా ప్రయత్నము చేసినిర్వికల్పసమాధి పొందవలయును. దీనిని పొందినవాడే భవబంధమనుసుడిలోనుంచి విడుపబడినవాడు.

ప్రశ్న. భవబంధమేది?

ఉత్త. అవిద్య, అహం, కర్మము అయిన ఈమూడును జీవులకు భవబంధమని చెప్పబడును. ఇదినిర్వికల్పసమాధివల్లతప్ప వేరే దేనివలనను పోలగదు. ఇందును నాలుగువిరోధములుకలవు.

ప్రశ్న. రసస్వాదమనగానేది?

ఉత్త. అఖండాకారవృత్తియైన తానునిల్చినచోటునయుండక పూర్వవాసనబలముచేత జగద్వికల్పమైన విషయరసమును భుజించుటకుపోవుటయే రసస్వాదము.

ప్రశ్న. ఇందుకు నివృత్తియెటువలెను?

ఉత్త. వైరాగ్యబుద్ధిచేత విషయములలో నభిముఖముపడిన వృత్తిని త్రిప్పిప్రత్యేకాత్మాభిముఖముగా నిల్పవలయును. ఈవిరోధములుత ప్పమరియే విరోధములువచ్చినను ధ్యానసమాధులచేతనా విఘ్నములనుపోగొట్టి నిర్వికల్పసమాధిని అభ్యసించవలయును, విషయములలో నింద్రియములజొరనివ్వక మనోనిగ్రహముచేయువాడే ధీరుడు. అతడే తీవ్రతరమోక్షాపేక్షకుడున్ను సకల యిచ్ఛాయిచ్ఛలేనివాడుగానుండును. వానినిదర్శించినమాత్రమేతాపత్రయాదిశోకమోహములంతయు దూరమైపోవును. పిదప సకలవిఘ్నములుపోగొట్టిరక్షించువాడుగానుండు పరమేశ్వరుడు అతనివద్ద యెల్లప్పుడును ఉన్మన్యుడుగానిల్చి అతనిచేతనర్చించబడి ప్రకాసించునుగనుక మోక్షాపేక్షకుడు సకలవిఘ్నములనువిడిచి ఈశ్వరుని పరముగానెంచి ఈశ్వరసహాయముచేత నిర్వికల్ప సమాధిచేయవలయును. ఇటువంటి రాజయోగియైనవాడు బహిరంతరములయందు స్వరూపముతప్ప అన్యములేని పరబ్రహ్మస్వరూపముతానై సకలకర్మలువిడిచి వూరకయుండును. ఇదియేముక్తిసాధననిలకడ; దీనినివున్మన్యావస్థయని పెద్దలుచెప్పుదురు.

ప్రశ్న. ఉన్మన్యావస్థయేది?

ఉత్త. నిర్వికల్పముగానుండు ఆత్మవద్ద ఆత్మాకారముగానేకరూపముగా

నుండు అఖండాకారవృత్తి జ్ఞానమే ఉన్మన్యావస్థయని పెద్దలు చెప్పుదురు. ఈప్రకారము అద్వైతపరబ్రహ్మప్రకాశముచేత నజ్ఞానాంధకారమున వృత్తియైతానేపరబ్రహ్మసాక్షాత్కార స్వరూపమై ప్రకాసించునపుడు దేహేంద్రియాదులలో నేను నాది యని కలిగే హృదయగ్రంధియు స్వరూపమును తెలియకుండు నటుల మరుగుపరచియుండిన సంశయములు సకలకర్మములు అజ్ఞానదుఃఖము గనుక, దానినిమూలముతోనాశముచేసినవాడే బ్రహ్మవేత్త. అతడే శ్రేష్ఠుడు, అతడే సకలబంధములనువిడిచినవాడు. ఈనిర్వికల్పసమాధిచేత ద్వైతభావములులేశమయినను లేక విడువబడి కేవల స్వరూపానంద మాత్రముగా నెరుకమరపులయిన త్రిపుటి కనబడక యుండుటయే అపరోక్ష సాక్షాత్కారస్థితి. ఈస్వానుభూతియైన మధ్యస్థితిలోవిషయములులేవు. భుజించువాడులేడుగనుక దీనినే ప్రతిజ్ఞానమని, పరజ్ఞానమని, స్వరూపజ్ఞానమనిచెప్పుదురు.

ప్రశ్న. ఇంకయు పలువిధములుగా జెప్పబడు ముక్తినిశ్చయములుయేవి ?

ఉత్త. చలనములేక యుండుస్థళముముక్తియనియు, ముమ్మలము వదలిన స్థళమే ముక్తియనియు, జాగ్రాతీతమే ముక్తియనియు, తలంపులులేక పెరమాణువుగానువిశేషప్రకాశముగానునిల్చిన స్థళమేముక్తియనియు, జాగ్రత్స్వప్న సుషుప్తిగడిచినస్థళమే ముక్తియనియు, శుద్ధత్రిపుటివదలినస్థళమేముక్తియనియు, కేవలమైన యెరుకమరపులులేనిస్థళమే ముక్తియనియు, మనోలయమైనస్థళమే ముక్తియనియు, సుఖాతీతమేముక్తియనియు, కామము, కోపము, మత్తుయను త్రివిధదుర్గుణములను వర్జించిన స్థళమే ముక్తియనియు, అనేకజ్ఞానశాస్త్రములలో జెప్పబడుచున్నది. యివియంతయు అపరోక్షసా

క్షాత్కారానందానుభవమునకు సమముగానుండును. ఇదియు నుగాక వేద బాహ్యములైన యితరమతములలో స్త్రీసంయోగ మేము క్తియనియు, గంధములు అయిదు తెలుసుకొనుటయే ము క్తియనియు, త్రిగుణములు లయమౌటయే ము క్తియనియు, పాషాణముగానుండుటయే ము క్తియనియు, వివేకముగలుగుటయే ము క్తియనియు, జీవత్వము చెడుటయే ము క్తియనియు,అనేకవిధములుగా జెప్పుటంతయు ము క్తికాదని పెద్దలుజెప్పుదురు. అపరోక్షస్వరూప సాక్షాత్కారమైన బ్రహ్మానందపరవశముచేత స్వస్వరూపవ్యాపకములో నేకభావముగా బాహ్యములోని కార్యములంతయువదలి నిశ్చలానందముగా నుండుటయే మౌనాతీతముగా ప్రకాసించు నిర్వికల్పమైన విదేహము క్తియని తెలుసుకొనవలయును. సిద్ధముమోక్షాపేక్ష కలిగిన అతితీవ్ర పక్వమైనవాడు నిష్కామ్యముగా శివపుణ్యములు చేయుటవలన పక్వముకలిగి మలపరిపాక ముద్భవించి అందుచేత శ క్తినిపాదముకలిగి సద్గురుదర్శనాపేక్షకలుగునట్టికాలములో వానికి ప్రాణాధీనుడుగానుండు ఆనందాతీతమైన బ్రహ్మమేకృపచేత దృశ్యమై ఆచార్యమూ ర్తిగా విజయముచేసి బ్రహ్మోపదేశమైన జ్ఞానదీక్షనుచేసి జ్ఞానశాస్త్రార్థములనుబోధించి కృపచేయును. దానినివిని మననముచేసి నిధిధ్యాసముపొంది జ్ఞాననిష్ఠతోగూడి నిర్వికల్పసమాధినిపొంది మోక్షశాంతికలిగితాను పొందినపేరు ప్రపంచము పొందవలయునని ఇచ్ఛతోడప్రపంచములో సదానిష్ఠ పరుడుగాను జీవన్ముక్తుడుగాను వసియించివుండును. ఆమహానుభావునిచేత వెనుకయుండు ముముక్షులకు వుపదేశము మొదలైనదికలుగును. యిందుకుసందేహము లేదని తెలుసుకొనవలెను.

ప్రశ్న. జ్ఞానపద్ధతులు అనగా యేవి ?

ఉత్త. అవి నిశ్చయజ్ఞానం, సమాధిజ్ఞానం, సహజజ్ఞానం, సాక్షాత్కార జ్ఞానం అని నాలుగువిధములు.

ప్రశ్న. నిశ్చయజ్ఞానమనగా నేమి ?

ఉత్త. గురుముఖముగా విపరీతములు పోయ్యేలాగున వేదాగమములను తెలుసుకొనుట శ్రవణం. ఆలాగు శ్రవణం చేసిన పదార్థములను విక్షేపములు లేక పరిశోధించి మనస్సునకు తెచ్చుకొనివాటిని ప్రసంగము చేయుటయే మననం. ఆలాగు మననమైన దానిని అసంభావన లేక శేషమైన పదార్థంతో నీనసి నిశ్చయముగ కలుగుట నిధిధ్యాసము. ఇవి అన్ని చేరుటయే నిశ్చయజ్ఞానము.

ప్రశ్న. ఈమూడింటికి కలవిఘ్నములు యేవి ?

ఉత్త. శ్రవణానికి విరుద్ధం అశ్రద్ధ, మననానికి విరుద్ధం విచారము లేనిది, నిధిధ్యాసమునకు విరుద్ధం నిశ్చయము లేనిది.

ప్రశ్న. వీటికి నివృత్తి యెట్లు?

ఉత్త. అశ్రద్ధనివృత్తి ఆచార్యునివల్ల, అవిచారమునకు దేవోపాసనవల్ల, అనిశ్చయానకు సాదుసాంగత్యమువల్ల, యీమూడు కలిగినవాడే పరోక్షమైన నిశ్చయజ్ఞాని.

ప్రశ్న. సమాధిజ్ఞానమనగా నేమి?

ఉత్త. త్వం, తత్, అసి, అది, నిజ అని అయిదుపదములు; వాటిలో ఒక్కొక్కపదానికి కేవళం, సకలం, శుద్ధం, అనిమూడు అవస్థలుగలవు, వాటిలో ఒక్కొక్కదానికి మూడు మూడు అవస్తలు మొత్తం తొమ్మిది. అవిమూడు కలుపుకొనగా పంచ్రెండు అవస్తలు గనుక అయిదుపదములకు అవస్తలు అరవై.

ప్రశ్న. త్వంపదములో మూడుఅవస్తలుయేవి?

ఉత్త. మనోనాశ అంధకారమే కేవలం, మనోనాశ చంచలమే త్వంపదస కలం, ఈరెంటిని యెఱిగే యెఱుకే త్వంపదశుద్ధం.

ప్రశ్న. త్వంపద కేవలములో మూడుఅవస్తలుయేవి?

ఉత్త. అంధకారం, తానుగానుంకుటయే త్వంపదమైన కేవలజాగ్రము, అంధకారమువిడిచియుంకుటయే త్వంపద కేవలస్వప్నం, అంధకారలయమే త్వంపద కేవలసుషుప్తి.

ప్రశ్న. త్వంపదసకలములో మూడవస్తలుయేవి ?

ఉత్త. చిత్తచంచలనము తానుగానుండడమే త్వంపదసకలజాగ్రం, చిత్తచంచలనము విడిచియుండిన దే త్వంపదసకలస్వప్నం, చిత్తచంచలనములయమైనదే త్వంపదసకలసుషుప్తి.

ప్రశ్న. త్వంపదశుద్ధములో మూడవస్తలుయేవి?

ఉత్త. జీవుడు తానుగానుంకుటయే త్వంపదశుద్ధజాగ్రం, జీవునివిడిచియుంకుటయే త్వంపదశుద్ధస్వప్నం, జీవత్వలయమే త్వంపదశుద్ధసుషుప్తి.

ప్రశ్న. తత్ పదములో మూడుఅవస్తలుయేవి?

ఉత్త. మాయాంధకారమే తత్పద కేవలం, సర్వజ్ఞత్వసామర్థ్యమే తత్పద సకలం, బ్రహ్మస్వరూపమే తత్పదశుద్ధం.

ప్రశ్న. తత్పద కేవలములో మూడవస్తలుయేవి?

ఉత్త. మాయాంధకారము తానుగానుండడమే తత్పద కేవలజాగ్రం, ఆ మాయాంధకారమువిడిచి యుంకుటయే తత్పద కేవలస్వప్నం, మాయాంధకారలయమే తత్పద కేవలసుషుప్తి.

ప్రశ్న. తత్పదసకలములో మూడవస్తలుయేవి?

ఉత్త. సర్వజ్ఞత్వ సామర్థ్యంతానైననే తత్పదసకలజాగ్రం, సర్వజ్ఞత్వసా

మూర్ఖ్యమువిడిచినదే తత్పదసకలస్వప్నం, సర్వజ్ఞత్వలయమేతత్పదసకలసుషుప్తి.

ప్రశ్న. తత్పదశుద్ధములో మూడవస్తలుయేవి?

ఉత్త. ఈశ్వరత్వము తానైనదేతత్పదశుద్ధజాగ్రం, ఈశ్వరత్వమువిడిచినదేతత్పదశుద్ధస్వప్నం, ఈశ్వరత్వములయమేతత్పదసకలసుషుప్తి.

ప్రశ్న. అసిపదములో మూడవస్తలుయేవి?

ఉత్త. అనందపరవశమే అసిపదకేవలం, చిత్ రూపవిలాసమే అసిపదసకలం, సర్వసాక్షియే అసిపదశుద్ధం.

ప్రశ్న. అసిపదకేవలములో మూడవస్తలుయేవి?

ఉత్త. అనందపరవశము తానుగానుండడమే అసిపదకేవలజాగ్రం, అనందపరవశమువిడిచియుండడమేఅసిపదకేవలస్వప్నం, అనందపరవశలయమే అసిపదకేవలసుషుప్తి.

పశ్న. అసిపదసకలములో మూడవస్తలుయేవి?

ఉత్త. చిద్ రూపవిలాసము తానుగానుండడమే అసిపదసకలజాగ్రం, చిద్ రూపవిలాసము విడిచియుండడమేఅసిపదసకలస్వప్నం, చిద్ రూపవిలాసలయమే అసిపదసకలసుషుప్తి.

ప్రశ్న. అసిపదశుద్ధములో మూడవస్తలుయేవి?

ఉత్త. పరబ్రహ్మముతాననేదే అసిపదశుద్ధజాగ్రం, పరబ్రహ్మమువిడిచియుండునదే అసిపదశుద్ధస్వప్నం, పరబ్రహ్మములయమే అసిపదశుద్ధసుషుప్తి.

ప్రశ్న. అదిపదములో మూడవస్తలుయేవి?

ఉత్త. స్వభావమే కేవలము, సర్వశూన్య నిరాలంబమేసకలం అతీతసాక్షియేశుద్ధం.

ప్రశ్న. అదిపద కేవలములో మూడవస్తలుయేవి ?

ఉత్త. స్వభావముతానైనదే అదిపద కేవల జాగ్రం, స్వభావము విడిచినదే అదిపద కేవలస్వప్నం, స్వభావలయమే అదిపద కేవల సుషుప్తి.

ప్రశ్న. అదిపదసకలములో మూడవస్తలుయేవి ?

ఉత్త. సర్వశూన్యనిరాలంబము తానుగానుండుటయేఅదిపదసకలజాగ్రం, సర్వశూన్య నిరాలంబము విడిచియుండునదేఅదిపదసకలస్వప్నం, సర్వశూన్య నిరాలంబలయమే అదిపద సకలసుషుప్తి.

ప్రశ్న. అదిపదశుద్ధములో మూడవస్తలుయేవి?

ఉత్త. సచ్చిదానంద రహితముతాననేదిఅదిపదశుద్ధజాగ్రం, సచ్చిదానంద రహితమువిడిచియుండునదే అదిపదశుద్ధస్వప్నం, సచ్చిదానంద రహితలయమే అదిపదశుద్ధ సుషుప్తి.

ప్రశ్న నిజపదములో మూడవస్తలుయేవి?

ఉత్త. ముగింపే కేవలం, యద్దార్థఅనుభవమేసకలం, మౌనమేశుద్ధం.

ప్రశ్న. నిజపద కేవలములో మూడవస్తలుయేవి ?

ఉత్త. ముగింపుతానైనదే నిజపద కేవలజాగ్రం, ముగింపువిడిచి యుండినదేనిజపద కేవలస్వప్నం, ముగింపులయమే నిజపద కేవలసుషుప్తి.

ప్రశ్న. నిజపదసకలములో మూడవస్తలుయేవి ?

ఉత్త. యదార్థఅనుభవం తానుగానుండుటయే నిజపదసకలజాగ్రం, యదార్థఅనుభవము విడిచియుండుటయే నిజపదసకలస్వప్నం, యదార్థఅనుభవలయమే నిజపదసకలసుషుప్తి.

ప్రశ్న. నిజపదశుద్ధములో మూడవస్తలుయేవి ?

ఉత్త. మౌనముతానైనదే నిజపదశుద్ధజాగ్రం, మౌనమువిడిచియుండునదే నిజపదశుద్ధస్వప్నం, మౌనములయమే నిజపదశుద్ధసుషుప్తి. పదములు ఆయిదింటికి అవస్తలు అరవై.

ప్రశ్న. సమాధిజ్ఞానములో త్వంపదదృష్టాంతమేది ?

ఉత్త. త్వంపదవాచ్యార్థములైన స్థూలశరీరాదిత్రయములున్ను, జీవుడున్ను నిషిద్ధజేసి లక్ష్యార్థమైనసాక్షియే తానుదీనికిదశమడు దృష్టాంతము.

ప్రశ్న. తత్పదదృష్టాంతమేది ?

ఉత్త. తత్పదవాచ్యార్థములైనవిరాట్, హిరణ్యగర్భ, మాయయైన శరీరత్రయములును ఈశ్వరుడున్ను విడిచి పేటికి లక్ష్యార్థమైన బ్రహ్మమే తాను దీనికి దృష్టాంతము రజ్జు, సర్పము.

ప్రశ్న. అసిపదదృష్టాంతమేది ?

ఉత్త. అసిపదవాచ్యార్థములైన సచ్చిదానంద వుపాధిత్రయమున్ను, పరబ్రహ్మమునువిడిచి లక్ష్యార్థమైన సర్వసాక్షియేతాను. ఇందుకుజాతి, వ్యాప్తి, దృష్టాంతము.

ప్రశ్న. అదిపదదృష్టాంతమేది ?

ఉత్త. అదిపదవాచ్యార్థములయినశుద్ధం, శూన్యం, స్వభావం, యీత్రయమున్ను విడిచి లక్ష్యార్థఅతీతసాక్షియేతానుగానుండుట దీనికినానానామదృష్టాంతము.

ప్రశ్న. నిజపదమునకు దృష్టాంతమేది ?

ఉత్త. నిజపదవాచ్యార్థములైనయథార్థం, రహస్యం, ముగింపు, ఈత్రయముపిడిచి లక్ష్యార్థమైన మౌనముగానుండుట దీనికియథార్థం దృష్టాంతము.

ప్రశ్న. సహజజ్ఞానం అనగానేమి ?

ఉత్త. ఒకవిషయాన్ని బహిర్ముఖమందును, అంతర్ముఖమందున్ను, విశేషమోహాములో అనుభవించేటప్పుడు మహాభయము పొందుకాల

మందును తనయొక్క స్వానుభూతి వీడువకుండుట సహజజ్ఞానం.
అదియేలాగంటె, అతీతమైనయీజ్ఞానమే బహిర్ముఖముగా మౌన
ముగానుండేకాలమందు మౌనజ్ఞానమనిన్ని, రహశ్యముతో చేరేట
ప్పుడు రహశ్యజ్ఞానమనిన్ని, యదార్థం చేరేకాలములో యదార్థ
జ్ఞానమనిన్ని, అతీతముతో చేరేటప్పుడు అతీతజ్ఞానమనిన్ని, యి
టువంటిజ్ఞానం యెప్పుడున్ను తననువిడచియుండనందున యిదియే
స్థిరజ్ఞానమని శ్రీదక్షిణామూర్తి సనకాదులకువుపదేశించి, చిన్ముద్ర
నుజూపి కటాక్షమొసగెను. ఆలాగున ఓయీ నైమిషారణ్య
ముందునుండు ఋషులుజ్ఞానమునుజూచి యీజ్ఞానోపదేశమును క్ర
మముగాపొందిన శిష్యునికిజ్ఞానియనిజెప్పిరి గనుక ఈజ్ఞానమే సహ
జజ్ఞానము.

ప్రశ్న. సాక్షాత్కార జ్ఞానమనగానేమి?

ఉత్త. సర్వోదయుడుగా వుదయాస్తమానరహితముగ నిత్యప్రకాశమై
అసంభావన విపరీతభావనలేక నిత్యనిరతిశయ సుఖముగాప్రకాశిం
చును. దీనిలో నిశ్చయజ్ఞానమువల్ల సత్తునుమూసే ఆవరణాన్ని,
సమాధిజ్ఞానమువల్ల చిత్తునుమూసే ఆవరణమున్ను, సహజజ్ఞానము
వల్ల ఆనందమునుమూసే ఆవరణమున్ను చెడిపోవును. ఈ యొ
క్క ఆనందం వుదయమయిగాకనుండును. సాక్షాత్కారదశలో
యెప్పుడున్ను వదలక నిత్యానందం గంభీరముగానుండును. అది
యేలాగంటె మిక్కిలిదరిద్రునకు రాజ్యాధికారమువస్తే యెవ్విధ
ముగాసంతోషపడునో నవ్విధముగానున్ను, గుడ్డివానికి కండ్లువస్తే
నెవ్విధముగాసంతోషపడునో నవ్విధముగానున్ను, వుత్తమస్త్రీకి భ
ర్తవస్తే నెవ్విధముగాసంతోషపడునో నవ్విధముగానున్ను, నీటి

లోమణిగెడి యోడదరిజేరగా వాటిలోనుండువారు నెవ్విధము గా సంతోషపడుదురో నవ్విధముగానున్ను, వుపాసనునికి యిష్టదేవత ప్రసన్నమయితే యెంతసంతోషపడునో నవ్విధముగానున్ను వుండును.

ప్రశ్న. త్వంపద వాచ్యమునుదీసి లక్షమయిన సాక్షిజ్ఞానమొకటి వుంటే చాలదా ?

ఉత్త. చాలదు. యెందుకనగా అఖండజ్ఞానంసిద్ధించదు. దృక్కు-అంతదృశ్యముగాజూచుటవల్ల తత్పదము తెలుసుకోవలెను.

ప్రశ్న. తత్పదవాచ్యార్థమునుదీసి లక్షమైనబ్రహ్మం ప్రకాశిస్తే చాలదా ?

ఉత్త. చాలదు. యెందుకంటే బ్రహ్మానికి సచ్చిదానంద లక్షమువుండుట వల్ల లక్షణాన్ని విడిచి లక్షవస్తువును దెలియవలెనుగనుక అసిపదము ను దెలుసుకోవలెను.

ప్రశ్న. అసిపదవాచ్యాన్ని విడిచి లక్షమయిన సర్వసాక్షిజ్ఞానం ప్రకాశిస్తే చాలదా ?

ఉత్త. చాలదు. యెందుకంటే స్వయం అనేపేరుసచ్చిదానంద స్వరూపమునకునువున్నదిగనుక దీనికి సాక్షిగానుండుటవల్లనున్ను, తెలును కానే దీన్ని తెలుసుకోబడేదిన్ని వుండుటవల్ల అదిపదాన్ని తెలును కోవలెను.

ప్రశ్న. అదిపదవాచ్యాన్నిదీసి లక్షమయిన అతీతసాక్షిప్రకాశిస్తువుంటే చాలదా ?

ఉత్త. చాలదు. యెందుకంటే యీసాక్షిత్వము శూన్యమునకు వుండుటవల్ల యిది బుద్ధి మాత్రమునకు శూన్యవాదము అవుటవల్ల నిజపదం తెలుసుకోవలెను.

ప్రశ్న. నిజపదవాచ్యాన్ని విడిచి జ్ఞానము ప్రకాశిస్తువుంటే చాలదా ?

ఉత్త. చాలదు. యెందుకంటే మౌనముమాహాత్మ్యమవుటవల్ల మహాత్మ్యము లో వస్తునిర్ణయము లేనందును మౌనాతీతమేవస్తువు అని కల్యాణసంభవరహస్యబోధచెప్పుటవల్ల మౌనాతీతవస్తువును తెలుసుకొనవలయును. అదియెట్లంటే మౌనాన్ని దెలిసి దానివిడిచినవాడు తానుగదా తానేతానైనజ్ఞానస్వరూపము; అది సర్వానికిన్ని విలక్షణముగానుండవచ్చును. ముందుచెప్పినప్రకారం సకలవ్యాపారము చేసినను చేసును. యేకాలములో తలచినను యీవస్తువును విడిచి యితరవస్తువులను కనుపడకుండా యెప్పుడున్ను విడిచియుండుట వస్తువుగాక వుండుటవల్ల యిది వేదసమ్మతం. విలక్షణముగావుండుట వల్ల ఆగమసమ్మతం అయినప్పుడు యిటువంటిస్థితి వేదాగమ సమ్మతమని తెలుసుకొనుము. యిది సమాప్తము.

ప్రశ్న. వైరాగ్యత్రయమనగానేమి?

ఉత్త. మందవైరాగ్యము, తీవ్రవైరాగ్యము, తీవ్రతరవైరాగ్యము అని మూడువిధములు?

ప్రశ్న. మందవైరాగ్యమనగానేమి?

ఉత్త. గృహకృత్యములలో వుండి వాటిగుండావచ్చేటటువంటి కష్టముల యందు విసుగుజెంది సన్యాసముపుచ్చుకొనుట. ఈ సన్న్యాసము వల్ల జ్ఞానముకుదరదుగనుక యిదివ్యర్థము.

ప్రశ్న. తీవ్రవైరాగ్యమనగానేమి?

ఉత్త. శరీరమువుండేవరకు సంసారమున్ను వాటితో చేరిన వ్యాపారాదులున్ను బొత్తిగా విడుచుట.

ప్రశ్న. తీవ్రతరవైరాగ్యమనగానేమి?

ఉత్త. బ్రాహ్మణులు చెప్పిన కర్మకాండమంతయు కల్పితమనిన్ని ప్రపంచము మిథ్యయనిన్ని కామితార్థప్రదవృక్షు యిదియన్నియు వమనాన్నమూత్రపురీషాదులవలె విడుచుట.

ప్రశ్న. తీవ్రవైరాగ్యములోగల యిద్దరుసన్యాసులెవరు ?

ఉత్త. కుటీచకసన్యాసి, బహూదకసన్యాసియను వారలు.

ప్రశ్న. కుటీచకసన్యాసి యనగానేమి ?

ఉత్త. దేహబలముడిగిసంసారము చెయ్యజాలక ఒకచోటునే వుండుటయే కుటీచకసన్యాసి.

ప్రశ్న బహూదకసన్యాసియనగానేమి ?

ఉత్త. దేహబలముదారుఢ్యముగాగలిగి దేశములున్ను తీర్థయాత్రలున్ను తిరిగేవాడు బహూదకసన్యాసి.

ప్రశ్న. తీవ్రతరవైరాగ్యములోగల యిద్దరుసన్యాసులెవరు ?

ఉత్త. హంససన్యాసి, పరమహంససన్యాసియనువారలు.

ప్రశ్న. హంససన్యాసియనగానేమి ?

ఉత్త. ఈసన్యాసికి ఈలోకములో ముక్తిలేదు. సత్యలోకములో ముక్తి యున్నదని పెద్దలు చెప్పుదురు.

ప్రశ్న. పరమహంస సన్యాసియనగానేమి?

ఉత్త. ఈలోకములోనే ఈసన్యాసికిజ్ఞానోదయమై ముక్తికలుగుతున్నదని పెద్దలు చెప్పుచున్నారు.

ప్రశ్న. పరమహంససన్యాసులు యెన్నివిధములు, వారెవరు ?

ఉత్త. జిజ్ఞాసి, సుజ్ఞాని అని రెండువిధములు. ఈజిజ్ఞాసి మొదట మూ డుభూమికల కధికారియనిపించుకొనును, సుజ్ఞాని, జీవన్ముక్తినిబొం ది పరిశుద్ధప్రకాశకుడైన పెద్దజిజ్ఞాసిసంసారమువిడిచినదైనను యుండు రులేక బ్రాహ్మణుడుగానున్ను, క్షత్రియుడుగానున్ను, వైశ్యుడు గానున్ను, శూద్రుడుగానున్ను, మ్లేచ్ఛుడుగానున్ను, శ్వపచుడు గానున్ను, చండాలుడుగానున్ను నైన యిన్ని విధములగు జాతు లలోనైనయుండురు. ఈస్థితియంతటికి వైరాగ్యమువల్ల గలిగే శాంతమే కారణము గనుక యితరముకాదు

నిర్వాణప్రకరణము సంపూర్ణము.

కైవల్యనవనీతసారసంగ్రహము సమాప్తి.

